

Chandamama, January, 1950

Photo by R. Krishnan

బాటసారులు

డిసెంబర్ **29** మొదలు

ఆంధ్రదేశమంతటా విడుదల....

వాహినీ వారి

# గుణసుందరి

కథ..

అనుక్షణము ప్రేక్షకులను
కవ్వించి నవ్వించే
అపూర్వ జానపద చిత్రము..

విజయవాడ... సరస్వతి
గుంటూరు.... సరస్వతి
తెనాలి........ రత్నా
ఏలూరు.... పాండురంగా
మచిలీపట్నం.... మినర్వా
రాజమహేంద్రవరం.. జయ
కాకినాడ క్రౌన్
విశాఖపట్నం... సరస్వతి
విజయనగరం... కృష్ణా
బళ్లారి.... రాయల్
కర్నూలు... చాంద్
బెంగుళూర్... మూవీల్యాండ్ & శ్రీ
మైసూర్... చాముండేశ్వరి
షోలాపూర్... సరోజ్

డైరెక్టర్
కె.వి. రెడ్డి, B.Sc (HONS)
అసోసియేట్ డైరెక్టర్
కె. కామేశ్వరరావు. B.A.

Sole Distributors :

**THE VAUHINI PICTURES LIMITED :: MADRAS, VIJAYAWADA, TADPATRI**

# అట్టమీది బొమ్మ

బృందావన ప్రజలు ఒకప్పుడు, ఇంద్రునికి యజ్ఞం చేయాలని సన్నాహంలో ఉన్నారు. అది చూచి శ్రీకృష్ణుడు నందునితో "నాయనా! ఈ హడావిడి అంతా ఏమిటి ?" అని అడిగాడు.

అందుకు నందుడు "బిడ్డా! వర్షానికి అధిపతి ఇంద్రుడు. ఆయనకు యజ్ఞంచేసి సంతోషపెట్టితిమంటే, వానలు కురిపిస్తాడు. వానలు కురిస్తే పంటలు పండుతై. పంటలు పండితే ప్రజలు సుఖిస్తారు" అని బదులు చెప్పాడు.

ఇది విని కృష్ణుడు "ఇదేమిటి ఈ అవివేకం! గోవులూ, పర్వతరాజు ఐన గోవర్ధనగిరి—ఇవే మన దేముళ్లు. వీటినే మనం పూజించుకోవాలి. అంతే గాని, ఎక్కడోవున్న ఇంద్రుడికి యజ్ఞంచేయడమా? ఆయన మనకు వర్షం కురిపించడమా ?" అని వారిని నిరుత్సాహపరిచాడు.

ఈ విధంగా తన యజ్ఞం మాన్పించేవరకు, ఇంద్రునికి మండుకొచ్చి, బృందావన ప్రజలకు శాస్తి చేయాలని నిశ్చయించుకొన్నాడు. అతని అజ్ఞ ప్రకారం, అకస్మికంగా మేఘాలు కమ్మేసి, ఉరుములతో, మెరుపులతో, పిడుగులతో, పెనుగాలితో ఘోరమైన వడగండ్ల వాన ప్రారంభించింది.

అప్పుడు అవతారమూర్తి ఐన కృష్ణుడు బ్రహ్మాండమైన గోవర్ధనగిరిని చేతి చిటికెనవేలితో, గొడుగు ఎత్తినట్టు అవలీలగా ఎత్తి పట్టుకొని, ప్రజలతో "మీకు వచ్చిన భయమేమీ లేదు. ఇలా వచ్చేసెయ్యండి. ఇంద్రుడు ఏమి చేయగలడో చూస్తా" నంటూ, అందరనూ కొండకిందికి చేరదీసుకొన్నాడు.

ఈ భీభత్సం ఏడు రోజులపాటు సాగించగలిగాడు ఇంద్రుడు. గోవర్ధనగిరి కదలకుండా కృష్ణుడు అలానే పట్టి ఉంచేవరకు, ఇంద్రుడు భూలోకానికి దిగివచ్చి, కృష్ణుని పాదాలమీద పడి క్షమాపణ కోరుకొన్నాడు. అంతటితో, అధికారగర్వంతో మిడిసిపడుతూవున్న ఇంద్రునికి గర్వపరిహార మైంది.

చందూ యొక్క సాహసకృత్యములు


















ది టాటా ఆయిల్ మిల్స్ కంపెని లిమిటెడ్




## బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టియున్ను, పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును, ఆరోగ్యము నిచ్చును.

K. T. Dongre & Co. BOMBAY - 4

---

## స్వాగతము

సహజ సౌందర్యాభివృద్ధికి మా రాజా ఆభరణములు అందము చేకూర్చును

బంగారు కవరింగ్ చేయబడిన RAJA బ్రాండు ఆభరణములు

కలరు 10 సం॥ గ్యారంటీ

172/5

RAJA-237/1-R COLOURED LOLAK Rs. 5-8-0 PER PAIR

NETAJI NEHRU SAIBABA PHOTO RINGS. Rs. 3-2-0 EACH

COLOURED STONE RING. Rs. 2-12-0 EACH.

BABY RING Rs. 1-0-0 EACH.

Rs. 2-0-0 EACH.

1306 PLAIN RING.

3-2-0 SAME MODEL WITH 3 RINGS CHAINS Rs. 2-0-0

CUFF LINKS 371 Rs. 1-12-0

NEHRU KRISHNA NETAJI ETC. 2-0-0

461 PIN 0-8-0 EACH

RAJA-265, RAJA 266, RAJA-265/1, RAJA 265/2

EACH Rs. 1-0-0

POSTAGE EXTRA BUTTONS EACH 0-13-0. Catalogue free on Application

రాజా గోల్డు కవరింగ్ కంపెని, మచిలీపట్నం.

అద్భుతవాటు 800 ఆభరణములు గల కేట్లాగు ఉచితంగా పంపుతాము ప్యాకింగు పోస్టేజి 0-14-0 అదనం నేడే ఆర్డరు వ్రాస్తారు కదూ.

---

## ఆరోగ్యానికి, రుచికరానికి




## పూజలకు, వివాహాలకు




## గడియారం మార్కు కర్పూరము

ఉపయోగించండి.

గోపాల్జీ ఛాంపక్సీ & కో.
నాయక్ వీధి, మద్రాస్



ఇరుగు పొరుగుల మైత్రి విభేదాలను
ప్రతిబింబించే సాంఘిక చిత్రము



విజయ ప్రొడక్షన్సు వారి

# షావుకారు

నిర్వాహకులు
నాగిరెడ్డి-చక్రపాణి

దర్శకుడు
ప్రసాద్








# చందమామ

పిల్లల కథల మాసపత్రిక

సంచాలకుడు: చక్రపాణి

సంపుటి 6 | జనవరి 1950 | సంచిక 1


1949-వ సంవత్సరం మొత్తంమీద కొన్ని కష్ట నష్టాలతోనే గడిపాం. ముఖ్యంగా మొన్న నీమధ్య వచ్చిన తుపానువల్ల చాల జననష్టం, పశునష్టం, ధననష్టం కలిగింది. ఎలాగో యివన్నీ తట్టుకొని ఇప్పుడు 1950-వ సంవత్సరంలో అడుగు పెడుతున్నాం.

ఈ సంవత్సర ఆరంభంలో మనకు ముఖ్యమైన పెద్ద పండుగ 'సంక్రాంతి' మళ్లీవచ్చింది. ఇప్పటికి ఎన్నో సంక్రాంతి పండుగలు ఇటువంటివి వచ్చినై, వెళ్లినై. కాని ఈ సంక్రాంతి యిదివరకు మనం గడిపిన సంక్రాంతి పండుగల కంటే ఎక్కువ విశేషం కలది. ఆ విశేషం ఏమిటీ అంటే— ఈ జనవరి 26 వ తేదిన మనదేశం స్వతంత్ర రాజ్యం కాబోతున్నది. ఇది యావద్భారతదేశానికి సంతోషకరమైన విషయమేకదా? ముఖ్యంగా మన ఆంధ్రులు ఆనందించ వలసిన విషయం మరొకటి: ఎంతకాలంనుంచో మనం ఎదురు చూస్తున్న ఆంధ్రరాష్ట్రంకూడా ఈ నెలలోనే సిద్ధించబోతున్నది.

ఇలాంటి సంతోషకరమైన సూచనలతో ప్రారంభమవు తున్నది కనుక, 1949 వలె కాకుండా ఈ 1950-వ సంవత్సరం మన కందరకూ చాలా జయప్రదంగా వుంటుందని ఆశిద్దాం.

9





# న్యాయఘంట

అనగనగా ఓ రాజు; ఆ రాజుకు
తన రాజ్యంలో, తన పాలనలో
న్యాయం నాలుగుపాదాలా
నడిపించాలని, ఆశ;

ఎంత శ్రద్ధగా పాలిస్తున్నా
ఏదో కొంత అధర్మం
జరుగుతోంది దేశంలో; రాజుకు
పెరుగుతోంది ఆరాటం.

యోచించంగా యోచించంగా
తోచింది బలే సదుపాయం;
నగరానికి సరిగా నడిబొడ్డున
న్యాయఘంట కట్టించాడు.

ఎవ్వరికైనా ఏనాడైనా
ఏదైనా అన్యాయం, జరిగితె
గంటను మ్రోగిస్తే న్యాయం
కావిస్తానని చాటించాడు.

అంతటితో ఆనాటను ధర్మం
అంతకంతగా పెరిగింది;
పనిలోపించిన గంట కడుపులో
పలుపు చివికి తెగిపోయింది.

పని కొడిగేనని ప్రజలా త్రాటికి
పచ్చి కొమ్మ తగిలించారు.

10

రచన:
'సముద్రుడు'

ఉందావూరి మడేలుకు పని
కెందుకుగాని ముసలి గాడిదె,
దాణాదండుగ అనీ చాకలీ,
తరిమేశాడు, ఊరిమీదికీ.

అకలేసి ఘంటకు కట్టిన చిగు
రాకుల కొమ్మను లాగెను గాడిదె
ఉరిమిందీ ఘణ ఘణ ఘంటా
ఊరూ నాడూ పోగయ్యింది.

రేఢు మడేలును రప్పించీ
'గాడిదె నేంచేశా?' వన్నాడు.
'ముదిగాడిదెకు గుదులెందుకని
వదిలేశా' నన్నాడు మడేలు.

'దుక్కవలే ఉన్నన్నీ నాళ్ళూ
ఎక్కడ బరువూ మోయించుకునీ
బక్కచిక్కి పోయిన సమయంలో
దిక్కే లేకుండా చేస్తావా ?

'నీ పిల్లలు నిన్నిట్లాగేచేస్తే
నీగతికూడా ఇంతే!' నంటూ
ఱేడు మడేలును గదమాయిస్తే
లెంప లేసుకున్నాడు.

కన్న తండ్రివలె ముదిగాడిదను
కాపాడాడు మడేలు.
నోరులేని జీవానికి న్యాయం
జరిగిందని దొర మురిశాడు.










విదిశాపట్టణం అనే ఒక పట్టణంలో దురదృష్టవశాత్తు ఒక రోజున ఒక కుఱ్ఱవాడు చనిపోయాడు. ఆ పిల్లవాడి తల్లిదండ్రులూ, బంధువులూ ఆ శవాన్ని తీసుకుని ఊరు అవతల ఉన్న శ్మశానానికి చేర్చి, దాన్ని ఒకచోట దింపి ఏడవసాగారు. అప్పుడు సాయంకాలం. మరి కాస్సేపటికి ప్రొద్దుగ్రుంకి చీకటి పడుతుంది.

అప్పుడు శ్మశానంలో ఉన్న రాంబందు ఒకటి వారిదగ్గిర వాలి, ఆ శవాన్ని చూసి కంట తడిపెట్టుకుంది. "అయ్యో, రత్నం లాంటి కుఱ్ఱవాడు! ఇలాంటి కుఱ్ఱవాడు చనిపోయాడూ అంటే నాకే ఏడుపువస్తోంది. పైవానినైన నాకే ఇంత దుఃఖంవస్తోంటే కడుపున కన్నవాళ్ళూ పెంచినవాళ్ళూ ఐన మీకు దుఃఖంరాదా? వస్తుంది. కాని యేడ్చి యేమిలాభం? ఎంత యేడ్చినా, గుండె బాదుకున్నా చచ్చిపోయిన పిల్లవాడు బ్రతికి రాడుకదా? అంచేత గుండె రాయిచేసుకుని శవాన్నిక్కడ వదిలేసి మీదారిని మీరు వెళ్లి పొండి. ఏమంటే ప్రొద్దు గ్రుంకుతోంది. ఇది వల్లకాడుగాని ఊరు కాదుగదా? చీకటిపడితే ఇక్కడికి దయ్యాలూ, భూతాలూ వచ్చి, బ్రతికిఉన్నవాళ్ళనికూడా పీక్కుతింటాయి" అంది.

ఈ మాటలు వినేటప్పటికి వాళ్ళకి 'నిజమే' అనితోచి, శవాన్నక్కడ వదిలేసి వెడదామని బయల్దేరారు.

వాళ్ళు తిరుగుమొహాలు పెట్టేటప్పటికి నక్క ఒకటి ఒక బొరియలోనుంచి వచ్చి, వాళ్ళకెదురై, "ఇదేమిటి? వచ్చి ఒక ఘడియఐనా కాలేదు, అప్పుడే శవాన్ని వదిలేసి వెళ్ళిపోతున్నారేమిటి? పున్నమ చంద్రుడిలాంటి పిల్లవాణ్ణి వదిలేసి వెళ్ళటానికి మీకు కాళ్ళెలా వచ్చాయి? 'చచ్చిపోయినాడుగదా' అని వదిలేసి

వి. వెంకమాంబ, మద్రాసు





పోతున్నారేగాని, మీ అదృష్టం బాగుండి, కుఱ్ఱవాడు మళ్లీ బ్రతకక్కూడదా? ఇంతకూ ఇప్పుడే ఇంటికి వెళ్ళి మీరు చేసేదేమిటి? అక్కడైనా ఏడుపేగా? ఆ యేడుపేదో ఇక్కడే ఏడవండి" అంది.

'కుఱ్ఱవాడు మళ్ళీ బ్రతకవచ్చు' అనేటప్పటికి వాళ్ళందరికీ ఆశకలిగి, వెడదామనుకున్నవాళ్ళంతా మళ్ళీ ఆగిపోయారు.

వాళ్లు అలాగ ఆగిపోవడం చూచి రాంబందు "ఎంత చోద్యంగా మాటాడుతోందీ, ఈనక్క? అప్పుడే శవంచెడిపోయి వాసనకొడుతోంది. అలాంటిదింకా ఈపిల్లవాడు బ్రతకటంఏమిటి? చచ్చినవాళ్ళు తిరిగి బ్రతికిరావటం ఎన్నడైనా విన్నామా? నేను శతవృద్ధుని. నామాట వినాలికాని, నిన్నగాక మొన్న పుట్టిన యీ గుంటనక్క మాటలా మీకు వేదవాక్కులు? చనిపోయినవాడికోసం ఏడుస్తూ కూచుంటే ఏమిలాభం? వెళ్ళి మీ శాస్త్రాలలో చెప్పిన ప్రకారం గోదానం, భూదానం, హిరణ్యదానం మొదలైన దానాలన్నీచేసి మరణించినవాడికి స్వర్గం ప్రాప్తించేటట్లు చూడండి; వెళ్ళండి; ఇక్కడ కూచోడమెందుకు?" అని తొందరపెట్టింది.

ఈ మాటలూ ఔననిపించి వాళ్ళు లేచి పోబోయారు కాని మళ్లీ నక్క ఎదురువచ్చి "ఏళ్ళువచ్చినంతమాత్రాన్ని రాంబందు బుద్ధిశాలి అనటానికి వీల్లేదు. దీనిమాటలు శుద్ధఅబద్ధమన్నమాట మీకే తెలుస్తుంది కొంచెంఆలోచిస్తే. 'చచ్చినవాళ్ళు బ్రతికిరావటం ఎన్నడైనా విన్నామా?' అనికదూ అంది? పూర్వకాలంలో సావిత్రి భర్తయైన సత్యవంతుడు బ్రతికిరాలేదా? చంద్రమతి కొడుకు లోహితాస్యుడు పాముకరిచి చనిపోయినవాడే మళ్ళీ జీవించలేదా? అలాగే మీ పిల్లవాడుకూడా తిరిగి బ్రతకవచ్చు. కనుక మీరు కాస్సేపు ఉండండి.







దయ్యాలూ, భూతాలూ మిమ్మల్ని పీక్కు తింటా యని ఈ రాంబందు మిమ్మల్ని భయపెడుతోందేగాని, ధైర్యవంతుల్ని దయ్యాలేమీచెయ్యలేవు. భూతనాథుడైన ఈశ్వరుణ్ణి మీరు ప్రార్థనచెయ్యండి. ఆ ప్రార్థనవల్ల భూతాలేమీ మీదగ్గరకు రావు సరికదా, శివునికి మీమీద దయపుట్టి మీకుఱ్ఱవాడిని ఆయన బ్రతికించవచ్చు కూడాను ?" అంది.

మామూలుగా ఉన్నవాళ్ళకి బుద్ధి పని చేసినట్లు దుఃఖంలో ఉన్నవాళ్ళకి పని చెయ్యదు. రాంబందు వెళ్ళమంటే లేచీ, నక్కవద్దంటే ఆగిపోయారేగాని, ఆ శవం యొక్క బంధువులు ఏమాటలు నిజమో ఆలోచించుకోలేకపోయారు. ఆ రాంబందూ, నక్కా ఒకదానికి వ్యతిరేకంగా ఒకటి అలా ఎందుకు చెప్పుతున్నాయోకూడా వాళ్ళు గ్రహించుకోలేకపోయారు.

ఆ రాంబందుకుగాని ఈ నక్కకిగాని పిల్లవాడు చనిపోయాడన్న విచారం ఏమీ లేదు. అవి రెండూకూడా అలా కల్లబొల్లి దుఃఖాన్ని వొలకబోస్తూ మాట్లాడాయేకాని, మనస్సులలో అరెంటికీ కూడా ఆ శవం కనపడడం సంతోషంగానే ఉంది. ఏమంటే రాంబందూ, నక్కాకూడా శవాన్ని పీక్కు తిని కడుపు ఆకలి తీర్చుకుంటాయి. అందుకనే ఆ రాంబందూ నక్కాకూడా అక్కడికి చేరినై. ఎటొచ్చీ అశవం నక్కకి దొరక్కుండా తనే తినెయ్యాలని రాంబందు ఆలోచించింది. తనకి లభించాలంటే చీకటిపడకుండానే ఆ బంధువులంతా శవాన్ని అక్కడ వదిలేసిపోవాలి. రాంబందు అన్ని పక్షులకుమల్లేనే ఆహారంకోసం పగలల్లా తిరిగి చీకటిపడేవేళకి తన గూటికి చేరుకుంటుంది. ఆలోపుగానే బంధువులంతా వల్లకాటిని వదిలిపోవాలని చెప్పి, వాళ్ళని పంపించివేయటంకోసం, గోదాన







మనీ, భూదానమనీ, స్వర్గలోకమనీ పెద్ద కబుర్లన్నీ చెప్పింది.

అంతకంటే ఎక్కువ కబుర్లు చెప్పింది, నక్క. రాంబందు శాస్త్రాలుతీసుకొస్తే నక్క పురాణాలు తెచ్చింది. నక్కకు పట్టుకున్న యావ యేమిటంటే, చీకటిపడితేనేగాని ఆ శవం దానికి దక్కదు. ఆలోపుగా బంధువులంతా శవాన్ని విడిచిపోతే రాంబందు దాన్ని కొంచెంగూడా మిగలకుండా పీక్కు తినేస్తుంది. అంచేత చీకటిపడేవరకూ ఎలాగైనా ఆ బంధువుల్ని శ్మశానంలో అప గలిగితే రాంబందు ప్రొద్దుకూకిందిగదా అని ప్రాణంవిసిగి, చక్కా పోతుంది. అప్పుడు బంధువులకు మెల్లిగా నచ్చజెప్పి పంపివేసి, పిల్లవాని శవాన్ని పూర్తిగా తనే భక్షించవచ్చు.

కూటికోసం ఇలా రాంబందూ, నక్కా తమతమ తెలివితేటలు కనపరుస్తూ మాట్లాడుతోంటే ప్రొద్దుగ్రుంకింది. బంధువులంతా నక్కచెప్పినట్లు ఒకమాటు ప్రార్థన చేసి చూద్దామని, "వందే శంభు, ఉమాపతిం, సురగురుం, వందే జగత్కారణం, వందే పన్నగ భూషణం..." అంటూ పరమేశ్వరుణ్ణి ప్రార్థించటం మొదలెట్టేరు.



ఇంక రాంబందు వాళ్ళెలాగా చీకటి పడ్డాకగాని వెళ్ళరనీ, ఆశవం తన కెలాగా తక్కదనీ నిశ్చయించేసుకుని, తననోట్లో కరక్కాయకొట్టిన నక్కకి మనస్సులో శాపనార్థాలు పెడుతో ఎగిరిపోవడానికి సిద్ధపడింది.

ఇంతలో చీకటిపడ్డంతోనే శ్మశానంగనక, అక్కడ విహరించటంకోసం ఈశ్వరుడు శాకినీ ఢాకినీ భూతపిశాచాలతో చక్కా వచ్చాడు. వచ్చేటప్పటికి ఆయనకి వాళ్ళ ప్రార్థన వినిపించి, అయన వాళ్ళకి ప్రత్యక్షమై, "ఏంకావాలి మీకు? ఎందుకు పార్థనచేస్తున్నారు మీరు?" అన్నాడు.

అప్పుడు వారందరూ బ్రహ్మానంద భరితులై "స్వామీ, ఈ పిల్లవాణ్ణి బ్రతికించు" మని ప్రార్థించారు.

శివుడు, "సరే" అని, ఆ కుబ్జవాడిని బ్రతికించేసరికి ఆ బాలుడు నిద్రలోంచి లేచినవాడికి మల్లే అవులిస్తూ "ఏమర్రా, ఇక్కడికొచ్చారేమిటి?" అన్నాడు.

గూటికి ఎగిరిపోదా మనుకుంటూన్న రాబందు జరిగినదంతా చూస్తూ విస్తుపోయింది. అంతవరకూ "ఇంక శవం నాకే దక్కింది" అని సంతోషిస్తూ కూచున్న నక్కకిమాత్రం ఆ శవానికి ప్రాణంవచ్చి కుబ్జవాడు లేచి కూచోటంతోనే మొహం మాడిపోయింది. అది ఉక్రోషం ఉండబట్టలేక పరమశివుణ్ణి తిట్టసాగింది.

అక్కడ బంధువులంతా దాని చర్య చూసి, "ఇదేమిటి? నీసలహాప్రకారం మేం ప్రార్థిస్తే శివుడు ప్రత్యక్షమై మా పిల్లవాణ్ణి మళ్లీ బ్రతికించాడు. ఆయన్ని తిడుతున్నావేమిటి?" అని ఆశ్చర్యంగా నక్కను అడిగారు.

అప్పుడు నక్క, "మీ పిల్లవాణ్ణి బ్రతికించమని నే నేడిశానా? 'ఈ శవాన్ని పీక్కుతినొచ్చు ఎంచక్క' అని నేను కనిపెట్టుకుంటే మధ్య ఈయన ప్రత్యక్షమై వీణ్ణి బ్రతికించి, నానోట్లో బెడ్డకొట్టేశాడు" అని యేడవటం మొదలెట్టింది.

రాంబందు దిగివచ్చి సంగతంతా చెప్పి, "స్వామీ, నానోటికందిన ఆహారాన్ని ఈ నక్క పడగొట్టింది. దీని ఆహారాన్ని నువ్వు పడగొట్టేశావు! ఇది న్యాయమే" అంది.

'కడుపుకోసమే కదా, యివి ఇంతకక్కూర్తి పడ్డాయ'ని శివుడు జాలివలచి, నక్కకీ రాంబందుకీకూడా అప్పట్నుంచీ ఆకలీ దప్పీ ఉండకుండా వరంఇచ్చి పంపేశాడు.

బంధువులు బాలుడితో యింటికి చేరుకుని, శ్మశానంలో జరిగినదంతా పదేపదే ఆశ్చర్యంగా చెప్పకుంటో; రాత్రి గడిపారు.






పూర్వకాలమందు కౌశాంబీ నగరంలో రత్నాకరుడనే కోటీశ్వరుడు ఉండేవాడు. అతనికి సులోచన అనే ఒక్కగానొక్క ఆడపిల్ల పుట్టింది. సులోచనను తండ్రి ఎంతో గారాబంగా పెంచుతూ వచ్చాడు. అయితే, తనకు మగసంతతి ఎవరూ లేకపోవటంవల్ల తన తదనంతరం పిల్లల క్షేమం కనుక్కొనేవాళ్లు లేరుకదా అనే పెద్దబెంగ పట్టుకుంది. ఈ బెంగతోటే రత్నాకరుడు మంచంపట్టి, కొన్నాళ్లకి చనిపోయాడు.

తండ్రి చనిపోవడంతో సంసారభారం అంతా సులోచన నెత్తిన పడింది. తను పెళ్లిచేసుకున్నట్టయితే బ్రహ్మాండమైన ఆస్తి అంతా పరులపాలు అయిపోతుందనే జంకుతో, ఆమె వివాహం చేసుకోనేకూడదు అని నిశ్చయించుకొన్నది. పురుషులు ఆమె కంటపడకుండా వుండేవిధంగా ప్రత్యేకించి ఒక భవనం కట్టించుకుని అందులో ఉండసాగింది.

సులోచన క్షేమం కోరినవాళ్లందరూ ఆమెను పెళ్లిచేసుకొనుమని వత్తిడిచేయ నారంభించారు. వారి మాట తీసివేయటానికా వీలులేదు. తనకా పెళ్లాడటం ఇష్టం లేదు. కనుక, బుద్ధిమతి ఐన సులోచన ఒక ఏర్పాటు చేసింది: "ఐదు ప్రశ్నలు వేస్తాను. వీటికి ఎవరైతే సరి ఐన సమాధానం చెప్పగలరో వారిని పెళ్లాడతాను" అని ఆమె అనేసరకు, అందరూ బాగున్నదంటే బాగున్నదన్నారు.

ఈవార్త తెలిసి దేశదేశాలనించి పరాక్రమవంతులైన రాజకుమారులు ఎంతోమంది వచ్చారు. వచ్చినవారంతా ఆమె వేసిన మొదటి ప్రశ్నకే 'జవాబు చెప్పటం మాతరం కాదు' అంటూ వచ్చినదారినే పోతూవచ్చారు.



కుమారుడైన ధీరసింహుడు సులోచనను చూడవచ్చి, ఆమె మొదటి ప్రశ్న ఏమిటో చెప్పమన్నాడు. అందుకు ఆమె "కొన్ని సంవత్సరాలుగా ఎక్కడినించో ఈ రాజ్యంలో 'ఒకసారి చూశానుగాని, మరి ఒకసారి చూడాలని వున్నది' అనేమాటలు వినిపిస్తూవున్నై. ఈ మాటలు ఎక్కడ నించి వస్తున్నవో వాటి అంతరార్థం ఏమిటో ఆ వివరాలు కావాలి" అని చెప్పింది. ధైర్యసాహసాలే జీవితంలో ప్రధానంగా పెట్టుకొన్న ధీరసింహునికి ఈ ప్రశ్న అసాధ్యమనిపించలేదు. అందుచేత తను తప్పక సమాధానం చెప్పగలనని నమ్మ బలికి, ఆమెవద్ద గడువు తీసుకొని తూర్పు దిక్కుగా బయల్దేరాడు.

ధీరసింహుడు పోయి పోయి ఒక కీకారణ్యం ప్రవేశించాడు. కొంతదూరంలో నక్కదంపతులు గొల్లుమని ఏడవటం వినపడింది. వాటివద్దకు వెళ్లి 'ఎందుకు ఏడుస్తున్నారు?' అని అడిగాడు ధీరసింహుడు. అందుకు అవి "అయ్యా! ఇక్కడికి ఒక కోసెడు దూరంలో ఒక కొండ, ఆ కొండలో ఒక గుహ, ఆగుహలో ఖడ్గమృగం అనేటటువంటి విచిత్రమైన జంతువు ఉన్నది. అది

సులోచనకు కావలసిందే ఇది. "అసాధ్యమైన ప్రశ్నలు ఇచ్చినట్టయితే ఎవ్వళ్లూ జవాబు చెప్పలేరుకదా. అటువంటప్పుడు నా నోటితో నేను అనకుండానే పెళ్లిసమస్య తప్పిపోతుందికదా. నా ఏర్పాటు సబువుగా వున్నప్పుడు నా క్షేమం కోరినవాళ్లుకూడా నాయందు తప్పు ఎంచలేరుకదా" అని ఆమె వుద్దేశం. ఈ ఉద్దేశంతోనే సులోచన కష్టాతికష్టమైన ప్రశ్నలు కల్పించింది.

చాలామంది రాజకుమారులు జవాబు చెప్పలేక తల వంచుకొని వెళ్లిపోయిన తరువాత చివరకు ఒకరోజున నేపాళ రాజ

మమ్మల్ని బతకనీయకుండా ముక్కు మీద ఉండే తన వాడికొమ్ముతో పొడిచి చంపుతూవుంది" అని చెప్పేవరకు ధీరసింహుడు తక్షణమే బయల్దేరి వెళ్లి ఆ గుహ చేరుకొన్నాడు.

అతను వెళ్లేసరికి ఖడ్గమృగం గాఢంగా నిద్రిస్తూవుంది. నిద్రిస్తున్న ప్రాణిని చంపడం పౌరుషవంతునికి తగదని తలిచి ధీరసింహుడు ఆ గుహ బయటికి వచ్చి ద్వారం ప్రక్కనేవున్న ఒక చెట్టుపైన పొంచి వున్నాడు. మరి కొంత సేపటికి ఖడ్గమృగం లేచి గుహలోంచి బయటికి రాసాగింది. ధీరసింహుడు అమాంతం దాని మీదికి దూకి, తను తెచ్చుకొన్న గొడ్డలితో దాని తల బ్రద్దలు కొట్టాడు. ఖడ్గమృగం గిలగిల తన్నుకుని చచ్చింది.

ధీరసింహుని సమయోచితానికీ సాహసానికీ సంతోషించి నక్కదంపతులు "రాజకుమారా! నీ ఉపకారం మేమెన్నటికీ మరచిపోలేము. మావల్ల నీకు కావలసిన సాయం ఏమిటో చెప్పు. చేతులు కట్టుకుని చేయటానికి సిద్ధంగా ఉన్నాము" అనే వరకు అతను తను బయల్దేరి వచ్చినపని నక్కదంపతులతో చెప్పాడు.



నక్కదంపతులు "నీవంటి సాహసికీ, యుక్తిశాలికీ, ఉపకారికీ అసాధ్యమనేది లేదు. నీకు తప్పక జయమవుతుంది" అంటూ కృతజ్ఞతను తెలిపి, అడవి దాటే వరకూ అతనివెంట వెళ్లి అక్కడనించి ఎడమచేతివేపు వెళ్లుమని సలహా చెప్పినై.

కార్యదీక్షగల ధీరసింహుడు కాళ్ళు కాలుతూవున్నప్పటికీ లెక్కచేయక, మండుటెండలో చాలదూరం నడచివెళ్లాడు. కొంతసేపటికి అలసట వచ్చి, ఒక చెట్టు నీడని చతికిలబడ్డాడు. అప్పుడు అతనికి ఎదురుగా రెండు పాములు కనబడినై. పెద్దపాము చిన్నపామును చంపబోతున్నది.



ఈ అన్యాయం చూచి ధీరసింహుడు, చిన్నపామును రక్షించువామనే వుద్దేశంతో పెద్దపామును తన బాణంతో కొట్టబోయే వరకు, ఆ రెండుపాములూ అదృశ్యమై, వాటికి బదులుగా ఇద్దరు గంధర్వులు ప్రత్యక్షమయ్యారు.

'మీరు ఎవరు? ఎందుకు ఇలా కొట్లాడుతున్నారు?' అని ధీరసింహుడు అడిగాడు.

'ఓయి రాజకుమారా! మేము చిన్నప్పటినించీ బద్ధశత్రువులం. నేను ఒంటిపాటుగా ఉండటం చూచి, నన్ను ఇతను హింసిస్తున్నాడు' అంటూ చిన్న గంధర్వుడు చెప్పాడు.



అప్పుడు ధీరసింహుడు వారిద్దరికీ సుద్దులుచెప్పి, రాజీ కుదిర్చేవరకు, వారు అమితంగా సంతోషించి, "రాజకుమారా! ఇన్నేళ్ళబట్టి మామధ్యని ఉంటున్న వైరం పోగొట్టినందుకు నీకు ఎంతయినా కృతజ్ఞులం. నీకు మేము చేయగల సహాయమేదైనా వుంటే చేసి, కొంతవరకైనా ఋణం తీర్చుకుంటాము, చెప్పు" అంటూ, అతని ఎడట చేతులుజోడించి నించున్నారు.

ధీరసింహుడు తను వచ్చినపని వెల్లడి చేయగా, "ఈ ప్రశ్నను గురించి మేమూ విన్నాము. దీనికి జవాబు చెప్పటానికి నిజంగా నీవే తగినవాడవు. కొంచెం ముందుకివెళ్ళి, కుడివైపు మళ్ళినట్లయితే ఒక కొలను కనిపిస్తుంది. ఆ కొలను చేరుకున్నావంటే, తరువాత ఏమి చెయ్యాలో సులువుగా తెలుస్తుంది. నీకు తప్పక జయం కలుగుతుంది" అనిచెప్పి, గంధర్వులు కొలనుకు దారి చూపించారు.

దీక్షాపరుడైన ధీరసింహుడు గంధర్వులు చెప్పిన దారినే వెళ్ళి కొంచెంసేపటికల్లా కొలను చేరుకున్నాడు. విశ్రాంతికొరకు అతను గట్టుమీద కూర్చునేసరికి, కొలను లోపలినుంచి అపురూపసుందరమైన





ఒక నాగకన్య వచ్చి, ధీరసింహుని చేయి పట్టుకొని లోపలకు తీసుకుపోయింది.

లోపల ఒక రమణీయమైన తోట ఉన్నది. కనుపండువుచేసే ఆ పచ్చటి చెట్ల మీద రకరకాల ఫలములు పండి సిద్ధంగా ఉన్నాయి. ఆ ప్రదేశంలో మధ్యమధ్యాని సెలయేళ్ళు గానం చేసుకొంటూ ప్రవహిస్తున్నయి. నేలంతా పచ్చలతో తాపటంచేసినట్టుంది. వృక్షాలన్నీ బంగారు రంగుతో మిలమిల మెరసిపోతున్నయి. ఇవి దాటుకొనిపోగానే ఒక దివ్య భవనం కనిపించింది.

ధీరసింహుణ్ణి ఆ భవనంలోకి తీసుకుపోయింది నాగకన్య. అక్కడ ఒక పెద్ద హాలు. ఆ హాలు మధ్యనుండే నవరత్నఖచితమైన సింహాసనంమీద కూర్చొబెట్టింది. హాలు నాలుగువైపులా గోడలకు అందమైన రాజకుమార్తెల పటాలు వేలాడుతున్నయి. ఒక చోటమాత్రం ఒక పటానికి సరిపడేటంత ఖాళీస్థలం కనపడింది. అతను ఈ పటాలు వింతగా చూస్తున్నంతలో తనను ఆహ్వానించిన నాగకన్యకూడా ఒక పటంగా మారిపోయి, ఆ ఖాళీజాగాను పూర్తిచేసింది. ఇప్పుడు ఆ హాలులో ధీరసింహుడు తప్ప



మరెవ్వరూ లేరు. అతనికి చాల ఆకలి వేసే వరకు, గద్దె దిగి తోటలోకి వెళ్ళాడు. ఆ తోటలో ఎన్నిరకాల పండ్లు కోసుకొని తిన్నా ఆకలి తీరలేదు. అక్కడి సెలయేళ్ళలోని నీళ్ళు ఎన్ని తాగినా దాహం తీరలేదు.

అప్పటికి చీకటి పడినందువల్ల అతను మళ్ళీ దివ్యభవనంలోకి వెళ్ళాడు. అతను వెళ్ళేసరికి దీపాలు వాటంతట అవే వెలిగినై. గోడలను వేలాడుతూవున్న పటాలన్నీ నిజమైన కన్యలుగా మారిపోయి, వారందరూ ధీరసింహుని చుట్టూ చేరి గానంచేస్తూ, నృత్యంచేయసాగారు. ఆ రాత్రల్లా వారు నృత్యంచేశారు. తెల్లవారేసరికల్లా ఆ కన్య






లందరూ మళ్ళీ పటాలలో బొమ్మలుగా మారిపోయి, గోడలకు వేళ్ళాడసాగారు.

అటుతరువాత అక్కడనే వున్న గోడ కన్నంలోనుంచి చీమలబారు పాకుతూ బయటకు రావడం కనపడింది, ధీర సింహునికి. అతను కన్నండగ్గరకు వెళ్ళి, గోడను తట్టేవరకు అక్కడ బోలుగా ధ్వనించింది. ఆ గోడను కత్తితో పొడిచి బద్దలగొట్టేసరికి, ఒక అరా, అందులో ఒక పాత తాళంచెవి కనపడింది. దానితో భవనంలోని ప్రతిగదివరకూ వెళ్లి తెరవ బోయాడు. కాని అది ఏగదికీ పడలేదు. దానితో చివరనుండే చిన్నగదిమాత్రం తెరవ గలిగాడు. అతను ఆ గదిలో ప్రవేశించి చూడగా అక్కడ ఒక ఇనుపపెట్టెమాత్రం ఉన్నది. ఆ పెట్టె తాళంచెవి ఎక్కడైనా దొరుకుతుందేమోనని అతను ఆ చోటంతా వెతికాడు. కాని ఎక్కడా తాళంచెవి కనిపించకపోయేసరికి ధీరసింహుడు నిరాశ చెంది మరలిపోతూవుండగా అతని కాలు నేలమీద ఉన్న ఒక మీటమీద పడింది. కాలు మీటమీద పడీపడటంతోనే ఇనుప పెట్టె గభీమని తెరచుకున్నది. అప్పుడు ధీరసింహుడు ఆ ఇనుపపెట్టెలో ఏమున్నదో అని చూచాడు. దాంట్లో ఒక రాగిరేకు తప్ప మరేమీలేదు.

ఆ రాగిరేకుపైన ఇలా వ్రాసి ఉన్నది: "ఇదంతా మాయ. ఎవ్వడైతే ఈ తోట మధ్యని ఉన్న బంగారు చెట్టును పెళ్లగిస్తాడో అతను ఈ మాయను తెలుసుకో గలుగుతాడు."

ఇది చూడగానే ధీరసింహుడు ఉత్సాహంతో తోటలోకి వెళ్లాడు. రాగిరేకుపైన వ్రాసివున్నవిధంగా బంగారు చెట్టు ఆ తోట మధ్యలో కనిపించింది గాని అతను దాన్ని పెల్లగించలేకపోయాడు. మళ్లీ నిరాశ చెంది, వెనుకకు తిరిగి పోబోతూవుండగా

అ చెట్టు పక్కనే అటువంటిదే ఒక చిన్న బంగారు చెట్టు అతనికి కనిపించింది. బహుశా రాగిరేకుపైన వ్రాసివున్నది ఈ చిన్నచెట్టు గురించేనేమో అనుకుని ధీర సింహుడు చిన్న చెట్టును పెల్లగించాడు. చిన్నచెట్టు పెల్లగించటంతోటే పెళా పెళా ధ్వని చెసుకుంటూ పెద్ద చెట్టు దానంతట అదే పడిపోయింది. ఈ పెద్ద ధ్వనికి ధీర సింహుడు స్పృహతప్పి పడిపోయాడు.

కొంతసేపటికి తెలివివచ్చి కళ్లుతెరచి చూడగా, అక్కడ తోటా లేదు. మేడా లేదు. పటాలలో వేలాడుతూవున్న నాగ కన్యలు మళ్లీ బిలబిలమంటూ వచ్చి అతన్ని చుట్టుముట్టారు. అప్పుడు ధీర సింహుడు "మీరు ఎవరు? ఈ మాయ అంతా ఏమిటి?" అని వారిని ప్రశ్నించాడు.

అందుకు వారు, "ఇక్కడికి పది యోజనాల దూరంలో ఉన్న మాయావతీ పట్టణ రాజకొమార్తెలం. మాకు యుక్త వయసు రాగానే, పెళ్ళిచేయుమని మేము మా తండ్రిని కోరగా, అయన మాపైన కోపగించి మమ్మల్నందరినీ ఈ భవనంలో బంధించాడు. 'అయితే మాగతి ఇంతేనా?' అని అడిగేవరకూ, 'మిమ్మల్ని ఎవడైతే



ఈ మాయనుంచి విడిపించగలడో వాడే మీకు తగిన వరుడు. అటువంటి సమర్థుడు లభించేవరకు కనిపెట్టుకొని ఉండి, వివాహ మాడవచ్చు' అంటూ సలహా ఇచ్చాడు. ఈ మాయను తెలుసుకోగలిగిన పురుషుడివి నీ వొక్కడివే ఈనాటికి కనపడ్డావు. కనుక, మమ్మల్ని పెళ్లాడవలసింది" అని కోరారు.

వారి కోరిక విని ధీరసింహుడు "ఓ నాగకన్యల్లారా! మీకథ తెలిసి సంతోషించాను. కానైతే, నేను ఇప్పుడు ఒక ముఖ్యమైన రాచకార్యంలో మునిగి వున్నాను. అందుచేత పెళ్ళిసంగతి తలచటానికే వ్యవధిలేదు. కాబట్టి మీరు మరెవరి

నైనా చూచుకొని వెళ్ళాకంది" అనిచెప్పి తనవారిన బయలుదేరాడు.

కాని, ఇంత నిష్కర్షగా చెప్పినప్పటికీ, నాగకన్యలు అతనిని వదలలేదు. వారు కూడా ధీరసింహుని వెంట పోసాగారు. అలా ముందు ధీరసింహుడూ అతనివెనుక నాగకన్యలూ కొంతదూరం పోయేసరికి "ఒకసారి చూచానుగాని, మళ్ళీఒకసారి చూడాలనివున్నది" అనే మాటలు విని పించినై. ఈమాటలు వినిపించగానే నాగ కన్యలుమాత్రం వెంటనే తిరిగి తమ భవ నానికి మరలిపోయారు. కాని ధీరసింహుడు ఏదిక్కునించి ఈ మాటలు వచ్చినయ్యో ఆ దిక్కుకుపోయి చూచేవరకు దీనావస్థలో ఉన్న ఒక రాజకుమారుడు కనిపించాడు.

"ఎవరు నువు అబ్బాయీ, ఎందుకలా విచారిస్తున్నావు?" అని అతనిని అడిగాడు.

ఆ రాజకుమారుడు, "ఈ మాయా మందిరంలో ప్రవేశించిన వాళ్ళలో నే నొకణ్ణి. అక్కడ ఉండే నాగకన్యలలో ఒకామెను ప్రేమించాను. కాని, ఆ భవనం బయటికి వచ్చినతరువాత మళ్ళీ అందులో ప్రవేశించటానికి దారీ తెన్నూతెలియలేదు. నా కోరిక తీరని కోరికగా నిలిచిపోయింది" అని తన కథ వినిపించాడు.

అప్పుడు ధీరసింహుడు ఆ రాజ కుమారుణ్ణి వెంటబెట్టుకొని, నాగకన్యలు ఉండే భవనంలోకి తీసుకెళ్ళి, తన ప్రజ్ఞవల్ల ఆ రాజకుమారుడు ప్రేమించిన నాగకన్యతో పెళ్లి ఏర్పాటు చేసి, పుణ్యంకట్టుకున్నాడు.

తరువాత అతను సులోచన వద్దకు పోయి, మాయామందిరాన్నిగురించిన చిత్రాలన్నీ చెప్పేవరకు, "అవును నా ప్రశ్నకు ఇదే జవాబు. ఇప్పుడు ఆమాటలు వినిపించటంలేదు కూడాను" అని ఆమె వప్పుకొని, "సరే, రెండవప్రశ్న చెబుతాను. రేపు రావలసింది" అని చెప్పి అతన్ని సాగనంపింది.

(ఇంకా వుంది)






చాలకాలం క్రిందట యజ్ఞదత్తుడనే పేద బ్రాహ్మణుడు ఉండేవాడు. అతను ఒక రోజున ఏదో పనిమీద పొరుగూరికి పోవలసి వచ్చింది. పోతూవుండగా దారిలో ఒక అరణ్యం ... యజ్ఞదత్తునికి మిక్కు... ...రకు, మూరు మూలనున్న ఒక పెద్ద బావి చేరుకొన్నాడు. ఆ పాడునూతిలో ఒక్క నీటిచుక్కకూడా లేదు. పైగా ఒకపెద్దపులి, ఒకకోతి, ఒక పాము, ఒక మానవుడు అందులో పడివున్నారు.

పెద్దపులి యజ్ఞదత్తుణ్ణి చూచి, "ఓయి బ్రాహ్మడా! దయవుంచి నన్ను బయటకు లాగి ప్రాణదానం చేసి పుణ్యం కట్టుకో" అని జాలిగా అడిగింది.

"నీ పేరు చెబితేనే అందరూ హడిలి పోతారు. ఇక నిన్ను నమ్మి ఎట్లా బయటికి లాగేది?" అన్నాడు బ్రాహ్మడు.

అందుకు పెద్దపులి, "ఓయి విప్రుడా! ఏపాపానికైనా ప్రాయశ్చిత్తం విధింపబడిందిగాని, కృతఘ్నుతకుమాత్రం లేదు. నేను కృతఘ్నురాలనైనపక్షంలో ఇహానికీ పరానికికూడ చెడిపోతాను. కనుక, నావల్ల నీకు ఎట్టి భయమూ లేదు. దయచేసి రక్షించు" అని మళ్ళీ ప్రార్థించింది.

అప్పుడు యజ్ఞదత్తుడు జాలిదలచి పులిని బయటకు లాగివేశాడు.

తరువాత కోతికూడా ఇలానే మొర పెట్టుకోగా, దాన్నికూడా అతను బయటకు లాగాడు. ఇదిచూచి పాముకూడా తనను బయటకు లాగమని బతిమాలింది. కాని, అందుకు యజ్ఞదత్తుడు "నీ పేరు చెబితేనే గుండె బద్దలవుతుంది. నీవంటి క్రూర జంతువును ఎలా కాపాడేది?" అన్నాడు.

అందుకు పాము "యజ్ఞదత్తా! కరవడమూ మానటమూ మాలో ఏమున్నది?

వి. తిమ్మరాజు, నాగాయలంక




ఈశ్వరాజ్ఞ లేనిదే మేమెవరికీ అపకారం చేయలేము. నావల్ల నీకు ఏమీ భయంలేదు. రక్షించి పుణ్యంకట్టుకో" మని మళ్లీ వేడుకొన్నది. యజ్ఞదత్తుడు జాలితలచి పామును కూడా బయటకు లాగాడు.

అప్పుడు పులి యజ్ఞదత్తుని చూచి, "అదిగో, అనేకశిఖరాలుగల ఆపర్వతానికి ఉత్తరదిక్కున గుహలో నేనుంటాను. అక్కడికి వచ్చినట్టయితే, నాచేతనైన ప్రత్యుపకారం చేస్తాను" అన్నది.

"ఆ గుహ ఎదటనే ఒక మర్రిచెట్టుపైన నా నివాసం. మా ఇంటికి తప్పక రండి" అని కోతికూడా ఆహ్వానించింది.

"ఆపత్కాలంలో నన్ను తలుచుకో. మేలు కలుగుతుంది" అన్నది పాము. ఈవిధంగా చెప్పి పులీ, కోతీ, పామూ తమ తమ నివాసాలకు వెళ్లిపోయినై.

తరువాత నూతిలో మనుష్యుణ్ణి యజ్ఞదత్తుడు జాలికొద్దీ బయటకు లాగేవరకు, అతను "అయ్యా! నేను బారుకచ్ఛ నగరంలో ఉండే బంగారుపనివాడిని. నగలు చేయించవలసివచ్చినపుడు నావద్దకు రమ్మ"ని చెప్పి, తన ఊరికి పోయాడు.

తనవల్ల సహాయం పొందిన జీవులు ఏమి సహాయం చేస్తవో చూదామని యజ్ఞదత్తుడు కోతివద్దకు పోయాడు. అది అనేకమైన తీయటి ఫలాలిచ్చి తృప్తిపరచింది.

అక్కడినుంచి యజ్ఞదత్తుడు పులివుండే గుహ చేరుకున్నాడు. పులి అతనికి కొన్ని నగలిచ్చి "బ్రాహ్మడా! ఒక రాజపుత్రుడు స్వారిచేస్తూ, గుర్రంమీదినుంచి పడి చనిపోయాడు. అతని ఒంటిమీద ఉన్న నగలు నీకోసం దాచివుంచాను" అని చెప్పింది.

'సరే, బాగానేవుంది. ఈ నగలను నా మిత్రుడైన బంగారుపనివానికిచ్చి అమ్మించుతాను' అని అనుకొని, యజ్ఞదత్తుడు బారుకచ్ఛపురంలోవున్న పనివానివద్దకు

వెళ్లాడు. ఆ పనివాడు యజ్ఞదత్తుణ్ణి ఎంతో గౌరవంతో అదరించి, వచ్చినపని ఏమిటని అడిగేవరకు, యజ్ఞదత్తుడు తన వుద్దేశం వెల్లడించి, నగలు చూపాడు.

ఆ నగలు చూచేసరికల్లా, "ఓహో, ఈ నగలు మన రాజకుమారునివి కాబోలు. ఆయన శవము ఈమధ్యనే కనిపించింది. చంపినవాణ్ణి పట్టి ఇచ్చినవారికి గొప్ప బహుమానంఇస్తామని రాజు చాటింపు వేయించి ఉన్నాడు. ఇతనే చంపివుండాలి. కనుక ఇతన్ని పట్టి ఇచ్చి బహుమానం పొందుతాను" అని దురాలోచన కలిగింది.

ఈ అలోచనతో అతను, "బ్రాహ్మడా! ఇప్పుడే వీటిని అమ్మి, సొమ్ము తీసుక వస్తాను, ఇక్కడనే ఉండు" మని నగలు పట్టుకపోయి, "హంత పట్టివేశాను ప్రభూ! ఇవిగో అంటూ రాజుతో మనవిచే రాజు బ్రాహ్మడికి ఉరి ఉరితీసేలోపల యజ్ఞదత్ వాగ్దానం జ్ఞాపకంవచ్చి,

పాము ప్రత్యక్షమై, స్తాను. ఆమెను బతికిం కాదు. కాని, నీవు తాకి




బ్రతుకుతుంది. రాజు నిను అని చెప్పి

# అమరసింహుడు

ఒకానొకప్పుడు జైనులకూ బ్రాహ్మణులకూ మధ్యని 'మేం గొప్పవాళ్ళ' మంటే 'మేం గొప్పవాళ్ళ' మని వాటా పంతాలు బయల్దేరినై. రాజావారికి జైనులపైన అభిమానం. రాణీగారికి బ్రాహ్మలపైన
... జైనులపక్షం తీర్పుచేస్తే
... ులపక్షం

వారిని గొప్పగా సన్మానించి కోరుకొన్న వరములు యివ్వటం, ఓడిపోయిన పక్షం వారిని విత్తనానికైనా పురుగు లేకుండా నాశనం చేయడం. ఇదీ పరీక్ష.

ఆ మరునాడు రాజాజ్ఞప్రకారం జైనులూ, బ్రాహ్మణులూ దర్బారుకు హాజరైనారు. రాజు వారితో యిలా చెప్పాడు:
"మనరాజ్యంలో ఒకచోట, ఒకవస్తువు
...ంచాము. అవస్తువు ఏమిటో,
...చివుంచామో కనుక్కోవాలి.
... ఎవరైతే నెగ్గుతారో వారికీ
... గొప్ప బహుమానాలిచ్చి
...పక్షంవారు ఓడిపోతారో
...ర్నీ విత్తనానికైనా ఒక్క
...డాచేస్తాము. ఇందుకు
...వు యిస్తున్నాము."
... వినగానే, జైనులకూ,
...లేనంత ఆశ్చర్యమూ,

భయమూ కలిగింది. చేసేది లేక వారంతా తిరిగి ఎవరి యిళ్ళకు వారు చేరుకున్నారు.

తరువాత ఏమిజరిగిందీ అంటే - గణిత శాస్త్రంలో నిధులైన జైనులు కోటచుట్టూ మూడుసార్లు ప్రదక్షిణంచేసి, లెక్కలు పడికట్టి, నిమిషాలమీద ఉన్నది ఉన్నట్టుగా యదార్థం గ్రహించారు. తమ విజయానికి జైనులు గర్వించి, ప్రభువుకి చెప్పవలసిన ప్రత్యుత్తరం నాలికచివర ఉండటంచేత, మనకేం భయమని నిర్విచారంగా ఉన్నారు.

ఇక తపశ్శక్తి సంపన్నులైన బ్రాహ్మణులు, ఆ రాజ్యంలో వున్నవారు అందరూ కలిసి, సముద్రంలో స్నానంచేసి, ఆ సముద్రపు ఒడ్డునే యిసుకలో తిష్ఠవేసి తీవ్రమైన తపస్సు ప్రారంభించారు. పగల్లా ఎర్రనిఎండలో ఆ యిసుకమీదా, రాత్రులు సముద్రపు హోరుగాలిలోనూ తపస్సుచేయటం అంటే మాటలా? కాని, వారు వాటిని వేటినీ లెక్కచెయ్యకుండా, అవిధంగా రాత్రింబవళ్లు నిశ్చలంగా తపస్సు చేస్తూనేవున్నారు. ఇలా ఒకరోజు కాదు. రెండు రోజులుకాదు. నిద్రహారాలు మాని, కేవలం గాలిపీలుస్తూ ఇరవైతొమ్మిది రోజుల వరకూ అలా తపస్సుచేస్తూనే వున్నారు.



వీరి తపోదీక్షచూచి సూర్యభగవానుడికే చాల ఆశ్చర్యం కలిగింది. "రేపు ఒక్క రోజేకదా వీరికున్న గడువల్లా. చూదాం, వీరు ఇలాగే దీక్షగా తపస్సు సాగిస్తారో లేక నిరాశచెంది మానుకుంటారో" అని సూర్య భగవానుడు కనిపెడుతూనే వున్నాడు. ముప్ఫయ్యవరోజునకూడా వారిలో ఒక్కరూ చలించలేదు. క్రమంగా చీకటిపడింది. ఆ రాత్రల్లా వారు తపస్సులో మునిగేవున్నారు.

మరొక రెండు గంటలలో తెల్లవారబోతుంది. గడువుప్రకారం వారు తప్పని సరిగా రాజువద్దకు పోవాలి. కాని రాబోయే విపత్తు సంగతే వారికి పట్టినట్టులేదు.



ఇదంతా చూస్తున్న సూర్యభగవానుడిక పూరుకోలేకపోయాడు. మరోగంటకల్లా తెల్ల వారుతుందనగా ఆయన ఒక వృద్ధబ్రాహ్మడి వేషంలో ఆ సముద్రపు ఒడ్డున వాళ్ళదగ్గిర ప్రత్యక్షమై వారిలో ఒకనిలాగానే, "లేవం డయ్యా, యింకా ముక్కులుమూసుకు కూర్చున్నారేమిటి. ఆ రహస్యం నేను కనుక్కున్నాను. మనకింకోగంట వ్యవధే వున్నది. పదండి త్వరగా" అని అందర్నీ తపోనిద్రనించి లేవగొట్టి తనతోపాటు తీసు కుని రాజుగారికోటకు బయల్దేరాడు.

అప్పటికప్పుడే జైనులందరూ కోటలో హాజరైవున్నారు. రాజూ, రాణీ ఎత్తైన సింహాసనాలమీద కూర్చునివున్నారు. అప్పటివరకూ తన పక్షపువారైన బ్రాహ్మణు లెవరూ తిరిగి తమఎదటికి రాకపోయేసరికి రాణీకి పిచ్చెత్తినట్టయింది. "ఓడిపోయానే! నేను ఓడిపోవటమేగాక పైగా నా మూల కంగా బ్రాహ్మణజాతి యావత్తూ నాశనం కాబోతోందే" అని ఆమె విచారంగా తల వంచుకొనివుంది.

రాజుకిమాత్రం "ఈ బ్రాహ్మలు ఇంకేం వస్తారు. వాళ్ళు వట్టి దద్దమ్మలని నాకు మొదటినుంచీ తెలుసు. వాళ్ళ కెట్లాగూ చావు తప్పదు" అని మనస్సులో తలుచు కుని చాల సంతోషిస్తున్నాడు.

ఇంతలో బ్రాహ్మణుల జట్టు అంతా అక్కడికి వచ్చిచేరింది. వారిని చూడగానే రాజు గుండెల్లో రాయిపడింది. రాణీ మొహం విప్పారింది. ఆమె ఆశగా బ్రాహ్మల వైపు చూచింది. బ్రాహ్మల జట్టుకంతకూ ముందునవున్న ఒక శతవృద్ధు సంతోషంగా వుండటం ఆమెకు కనిపించేసరికి, ఆమె మనస్సు స్తిమితపడింది.

కొంతసేపు ఆప్రదేశమంతా నిశ్శబ్దంగా వుంది. తర్వాత రాజు జైనులవైపు తిరిగి "ఏమిటి మీసమాధానం?" అని అడిగాడు.

అందుకు బదులుగా ఒక వృద్ధ జైనుడు ముందుకువచ్చి "మహాప్రభూ! తమరు ఒక మట్టికుండలో బంగారు పామును వుంచి, ఆ కుండను మనకోట సింహద్వార మందు పాతివుంచారు. స్వయంగాత్రవ్వించి చూడవచ్చు" అని విన్నవించాడు.

ఇది వినేసరికి రాజుకి తన పక్షమే గెలిచింది కదా అని బ్రహ్మానందమైంది. "చూచావా? నా పక్షమే గెలిచింది!" అన్నట్టు గర్వంగా రాణివైపు చూచాడు.

రాణీదిగులుగా బ్రాహ్మలవంక చూచింది. అప్పుడు బ్రాహ్మల జట్టుకు ముందున వున్న శతవృద్ధు ముందుకు వచ్చి, "మహాప్రభూ! వీరు చెప్పింది ఎంతమాత్రమూ నిజం కాదు. అది మట్టికుండ కాదు; యిత్తడిబిందె. అందులో తమరు వుంచినది బంగారు పాముకాదు; సజీవమైన నాగుపామే. ఇక వీరు చెప్పిన చోటుకూడా తప్పే. బిందెను పాతిపెట్టినది పాణిద్వారమందునకాని, సింహద్వారమందు కాదు. స్వయంగా పరీకించి చూడవచ్చు" అని తిరిగి తన స్థానంలోకి వెళ్లి నిలబడ్డాడు.

ఇది వినేసరికి రాజూ, జైనులూకూడా రాతిబొమ్మలలా చూస్తుండిపోయారు.




తరువాత రాజు వారినందరినీ వెంటబెట్టుకుని సింహద్వారమందు తను కుండను పాతిపెట్టించిన చోట త్రవ్వించి చూచాడు. కాని అక్కడ కుండా లేదు, ఏమీలేదు. ఇది చూచేసరికి జైనులు కొయ్యబారిపోయారు. తర్వాత తెప్పరిల్లుకుని వారు రాజువెంట పాణిద్వారం వద్దకు వెళ్ళారు. అక్కడ త్రవ్వి చూచేసరికి బ్రాహ్మణవృద్ధు చెప్పినట్లుగానే ఇత్తడి బిందె కనిపించింది. తనప్రాణం పోయినా సరేనని ఒక జైనుడు నిజంగా నాగుపాము వుందోలేదో చూతామని మూతతీశాడు. వెంటనే అందులోంచి బుసలు గొట్టుతూ నాగుపాము బయటికి వచ్చింది.

ఇష్టమైనా అయిష్టమైనా ఏర్పాటు ప్రకారం రాజుగారు బ్రాహ్మణులను సత్కరించటమూ, జైనులను నాశనం చేయటమూ తప్పిందికాదు. జాలిగుండెగల రాణీగారు 'ఏదో మాటవరసకు అనుకొన్నామేగాని, ఇంతమందిని చంపించి ఉసురుపోసుకోవటం న్యాయం కాదు. జైనులను వదిలేయండ'ని బతిమలాడింది.

"రాజ్యమేలే ప్రభువులే మాట తప్పితే ఎలాగ? ఏమైనా సరే మొదట మనమనుకొన్నట్టూ జరిగి తీరవలసిందే. దీనికి తిరుగులేదు" అన్నాడు రాజు.

మరునాడు జైనులందరనూ వరసగా నిలబెట్టించారు. వారిలో వయోవృద్ధు, జ్ఞానవృద్ధు అయిన అమరసింహుడు 'అయ్యో మనజాతికి ఎటువంటి ఆపద వచ్చింది! దివ్యమైనటువంటి మన శాస్త్రమే నశించిపోతున్నదే! అని విచారిస్తూవుండగా అతనికి ఒక చక్కటి అలోచన తోచింది. వెంటనే రాజువద్దకుపోయి, ఒక్క పూట గడువు కోరేవరకు, రాజు అంగీకరించాడు.

గడువు పూర్తి అయ్యేవరకూ జైనులందరనూ ఖైదులో ఉంచారు. సూక్ష్మబుద్ధి అయిన అమరసింహుడు నిమిషమైనా వర్ధంచేయక, తాటాకులూ ఘంటాలూ తెప్పించి ఒకమహాగ్రంథం వ్రాయసాగాడు.

గడువుకాలం తీరేసరికల్లా, ఖైదులోని జైనులను చూడడానికి రాజు స్వయంగా వచ్చాడు. అప్పటికప్పుడే అమరసింహుడు ప్రారంభించిన గ్రంథం పూర్తి అయింది. దానిని అతను రాజుకి అర్పించాడు.

రాజు ఆ గ్రంధాన్ని పరిశీలించినమీదట, వారికి విధించిన శిక్ష రద్దుచేసి, వారినందరినీ విడుదల చేశాడు. రాజు చూపిన ఔదార్యానికి జైనులూ, బ్రాహ్మలూ కూడా చాలా సంతోషించారు. అమరసింహుని పేరు శాశ్వతంగా నిలిచిపోయేటట్లు రాజు ఆ గ్రంధానికి 'అమరము' అని పేరుపెట్టాడు.



# ఎంతకూ నిండని గోతము



అనగనగా ఒక రాజు. ఆ రాజుదగ్గర ఒక మంగలి ఉండేవాడు. వాడు ఒక రోజున అడవిమార్గము ద్వారా పొరుగూరికి పోవలసివచ్చింది. అలా ఒక పెద్ద చెట్టు క్రిందినుంచి పోతూవుండగా, "అబ్బాయీ! నావద్ద వరహాలతో నిండిన ఏడు గోతా లున్నాయి. అవి నీకు కావాలా?" అంటూ, ఒక చిత్రమైన ధ్వని వినిపించింది.

మంగలి అటు యిటు చూచాడు. కాని, ఆ చుట్టు ప్రక్కల ఎవ్వరూ కనపడలేదు. "ఈ చెట్టుమీద ఏదో దెయ్యం వుండి వుంటుంది. నన్ను మోసంచెయ్యటానికి అదే యిలా అరిచివుంటుంది. కనుక యిక్కడ క్షణంకూడా నిలవకూడదు" అనుకొని అతను తిరిగి తనదారిన పోసాగాడు.

కాని, మంగలి యింకా పందగజాల దూరమైనా పోకముందే మళ్ళీ ఆ చెట్టు వైపునించి, "నిన్నేనయ్యా అలా పారిపోతా వేమిటి? నేను చెప్పింది అబద్ధంకాదు. నీకు కావాలంటే ఆ ఏడుగోతాలు యిస్తాను రా" అని వినిపించింది.

ఈసారిమాత్రం మంగలికి కొంచెం ఆశ కలిగింది. సరే, ఇంతలో ఏంపోయింది, అని తలచి, చెట్టుదగ్గరికి తిరిగివచ్చి "నాకు కావాలి" అని గట్టిగా అరిచాడు. అందుకు బదులుగా "సరే, ఏడుగోతాలూ మీ ఇంటికి చేరాయి. పోయి చూచుకో" అని ఆ అశరీర వాణి మళ్ళీ జవాబు చెప్పింది.

ఈ జ[illegible] మంగలికి ఆశతోపాటు [illegible]గింది. "ఐనా, ఈ మాటలు ఎంతవరకు నిజమో చూదాం" అని ఆలోచించి, వాడు ఆత్రంతో ఒక్క పరుగున ఇల్లు చేరుకొన్నాడు. తలుపు తెరచి చూచేవరకు, ఏడు గోతాలూ ప్రత్యక్షంగా కనబడినై.

హెచ్. వి. గోపాలకృష్ణమూర్తి, బెంగుళూరు



గబగబలాడుతూ మంగలి ఆ గోతాలు ఒక్కొక్కటే విప్పి చూడసాగాడు. వరసగా ఆరు గోతాలనిండుగా మిలమిల మెరుస్తూ వరహాలున్నై. ఏడవగోతం విప్పి చూచాడు. కాని అందులో ఏమీ లేవు. ఒక్క చీటీ మాత్రం వుంది.

ఆ చీటీమీద ఈవిధంగా రాసివుంది. "ఈ ఏడవగోతం నింపటం నీవంతు. అది నింపగలిగితేనే నేను నీకుయిచ్చిన మిగతా ఆరు గోతాల వరహాలూ నీకు దక్కుతై. అది గనక నింపలేకపోయావంటె ఈ ఆరు గోతాలూ నీకు ఏవిధంగా వచ్చాయో అదే విధంగా మాయమవుతై."

ఈ చీటీ కంటపడేవరకు, ఎలాఅయినా శ్రమపడి ఆ ఏడవగోతంకూడా పూర్తి చేయాలీ అని తీవ్రమైన కాంక్ష పట్టుకుంది మంగలికి. ఒక గోతంనిండుగా వజ్రాలు నింపాలీ అంటే అంత తేలికగా అయ్యేపనా? కాని, మంగలికిమాత్రం తను కడుపు మాడ్చుకొని అయినా సరే, అగోతం నింపి, ఆ అరుగోతాల వరహాలూ పోకుండా నిలపచేసుకోవాలని దురాశకలిగింది.

మొట్టమొదట అతను, తన ఇంట్లోవున్న వెండి, బంగారు నగలన్నిటినీ అమ్మివేసి, వాటిని వరహాలుగా మార్చి, ఏడవగోతంలో పోశాడు. కాని వరహాలు గోతంలో ఒక మూలకికూడా చాలలేదు.

ఇది పనికాదనిచెప్పి, తను కడుపునిండా తిండి తినటం మానుకొన్నాడు. కడుపు మాడ్చుకొని ధనం పోగుచేసిఅయినాసరే ఆ గోతం కూడా వరహాలతో నింపాలని అతని ఉద్దేశం. కాని నెలలతరబడి వాడు అలా కడుపుమాడ్చుకొని ధనం కూడబెట్టినా అది నిండలేదు.

ఆ మంగలి ఒకనాడు రాజును దర్శించి, "ప్రభూ! చాలా కష్టకాలంగా ఉన్నదండి. జీతం బొత్తిగా చాలటంలేదండి. ఏలినవారు

కటాక్షించాలండి" అంటూ దీనంగా మనవి చేసుకున్నాడు.

రాజు జాలిపడి అభిమానంతో ఆ నెల నుంచీ వాడిజీతం రెట్టింపుచేశాడు. మంగలి ఈ జీతమంతా కూడబెట్టి, అఏడోగోతంలో వేస్తూ వచ్చాడు.

మరి కొన్ని నెలలు గడిచినై. కాని, ఎంతకూ గోతం నిండదే!

అరోజు మొదలుకొని మంగలికి పెద్ద బెంగపట్టుకుంది—"నేను ఎంత ప్రయత్నించినా ఈ ఏడో గోతం నింపలేకపోతున్నాను. ఇది నింపలేకపోతే మిగత అరూ కూడా మాయ మయిపోతయి కదా? ఏమి చెయ్యనా?" అని. వాడికి ఇరవైనాలు గుగంటలూ యిదేదిగులు.

ఇలా ఉండగా, మరికొన్నాళ్ళకి ఒక రోజున అతను మామూలుగా రాజుగారికి క్షవరం చెయ్యటానికి వచ్చాడు.

మంగలి చాల దీనంగా ఉండటం రాజు కనిపెట్టి, "ఏమిరా అబ్బాయీ! నీ జీతం ఇప్పుడున్నదానిలో సగం ఉన్నప్పుడే నువు ఉత్సాహంగానూ, నిశ్చింతగానూ ఉండేవాడివే? ఇప్పు డిట్లా బిక్క మొగం వేసికొని ఉండటానికి కారణమేమిటి? నీ




కేమి కీడు మూడింది? కొంపతీసి, ఆ ఏడు గోతాలూ నీకు తటస్థపడలేదుకద!" అని ప్రశ్నించాడు.

'ఆ ఏడుగోతాలు నీకు తటస్థపడలేదు కద!' అనేసరికల్లా మంగలి ఉలిక్కి పడ్డాడు.

"అవును, మహారాజా! కాని, ఈసంగతి తమరి కెలా తెలిసిందండి?" అంటూ, కంగారుగా ప్రభువును అడిగాడు మంగలి.

అప్పుడు రాజు, "ఓరి పిచ్చివాడా! ఎవరు చెప్పేదేమిటి? నీ కింకా తెలియనే తెలియదా! అడవిలో చెట్టుపైన ఉన్న యక్షుడు ఈ ఏడుగోతాలనూ ఎవరికైతే

దత్తం చేస్తాడో, వాళ్ళయందు ఈ లక్షణా లన్నీ కనిపిస్తయి. యక్షుడు నాకూ ఇలాగే 'ఈ గోతాలను తీసుకో' మని చెప్పి యిచ్చాడు. నీకు కనిపించినట్టుగానే అవు గోతాలనిండుగా వరహాలూ, ఏడోగోతంలో చీటీ కనిపించినై. కాని నీలాగా నేను ఆ ఏడోగోతం నింపటానికి ప్రయత్నింప దలచ లేదు. ఎందువల్లనంటే యిందులో ఏదో మోసం వుండబట్టే ఈ గోతా లింత తేలికగా సమకూరినై. ఈ ఏడవగోతం నింపటానికి ప్రయత్నించటం శుద్ధ తెలివితక్కువ. కనుక నేను మళ్లీ వెంటనే ఆ యక్షుడున్న చెట్టుదగ్గిరికి వెళ్ళి 'నీ గోతాలు నా కక్క ర్లేదు. నీవి నీవే తీసుకో' అని కేకవేశాను. ఇలా కేకవేసి నేను తిరిగి యింటికి వచ్చే సరికి ఆ గోతాలు ఎలా వచ్చాయో అలాగే మాయమైనై.

"కనుక నువ్వుకూడా తక్షణమేపోయి వాటిని తిరిగి యక్షునికి ఇచ్చివేయి. వెళ్లు. ఆలస్యం చేయకు" అని మంగలికి సలహా చెప్పాడు.

రాజు చెప్పిన సదుపదేశానికి మంగలి బుద్ధితెచ్చుకొని, యక్షుడు ఆవహించిన ఆ చెట్టువద్దకు పోయి, "ఓయి యక్షుడా! నీ గోతాలు నీవే తీసుకో బాబూ! నాకు అవి ఎంతమాత్రం అక్కరలేదు" అని వేడుకొన్నాడు.

ఇందుకు బదులుగా యక్షుడు అశరీర వాక్కుతో 'సరే అలాగే తీసుకొంటాను. నీవు వెళ్లు!' అని జవాబుచెప్పాడు.

వెంటనే మంగలి ఇంటికి చేరుకొని చూచేసరికి, ఆ ఏడుగోతాలూ ఎంత చిత్రంగా వచ్చాయో, అంత చిత్రంగానూ అదృశ్యమైపోయినై.

కాని దురదృష్ట మేమంటే అవి మాయ మైపోవటమే గాక, వాటితోపాటు పాపం, మంగలి ఇన్నాళ్ళనించీ కూడబెట్టిన ధన మంతా ఎగిరి చక్కాపోయింది!



# అశ్వబలి

గుర్రాలకు ప్రసిద్ధిచెందిన అరేబియా దేశంలో, పూర్వం 'గిబ్రూ' అనే గ్రామాధికారి ఒకడు ఉండేవాడు. పరిపాలనలో గిబ్రూ చాలా కచ్చితమైనవాడు. కాని ఎంత కచ్చితమైనవాడో అంత దయకలవాడు.

గిబ్రూ, గొప్పదాత అని దేశ దేశాల కీర్తి వ్యాపించింది. దానం ఇచ్చేటప్పుడు ఎటువంటి త్యాగమైనా చేసే సాహసం కలవాడు. 'గిబ్రూ! నాకీ వస్తువు కావాలి' అని ఎవరైనా వచ్చి అడిగితే, 'లేదు' అనే మాట అతని నోట ఎన్నడూ రాదు. ఇంతటి ఉదారుడైన గిబ్రూవద్ద ఏవో ఒకటి అడిగి పట్టుకుపోవచ్చుకదా అని, దూర దేశాలనుంచికూడా ప్రజలు వచ్చేవారు.

తన ఇంటికి ఎవరువచ్చినా, గిబ్రూ ఎంతో మర్యాదగా వారిని ఆదరించి అర్ఘ్యపాద్యాదులిచ్చి, పంచభక్ష్య పరమాన్నములతో భోజనంపెట్టి, హాయిగా పడుకునేందుకు హంసతూలికాతల్పాలు అమర్చేవాడు. ఇటువంటి ఏర్పాట్లు చేసిన గిబ్రూ మంచితనానికి మెచ్చుకొని, ఆ వచ్చిన అతిథులు తృప్తిపడేవారు. ఒకవేళ, గిబ్రూవద్ద అయాచితంగా ఏదైనా అడిగి పట్టుకపోవాలనే దురాశతో వచ్చినప్పటికీ, గిబ్రూ ఇంట ఆతిథ్యం పొందినతరువాత వారిలో దురాశలు అంతరించి, వారి మనసు మంచిగా మారిపోయేవి.

ఇటువంటి గిబ్రూకు ఈ లోకంలో అత్యంత ప్రియమైనది ఒక్కటే ఉన్నది. అది యేమిటంటే, అతను అపురూపంగా పెంచుకొంటూన్న 'అమ్రూక్' అనేగుర్రం. అమ్రూక్ పైన గిబ్రూకు పంచప్రాణాలు.

ఆ కాలంలో అరేబియాదేశాన్ని ఇబ్రహీం అనే సుల్తాను పరిపాలిస్తూ ఉండేవాడు. ఇబ్రహీంకూడా గిబ్రూ అంత మంచివాడే. ఆయనకుకూడా గుర్రాలంటే చాలాసరదా.

కె. వి. జానకి, కర్నూలు



సరదా ఉండటంచేతనే, ఆ దేశంలో ఉండే అందమైన అరబ్బీగుర్రాలను ఎక్కడెక్కడినుంచీ రప్పించి, సుల్తాను తన దివాణపు డేరాలలో అట్టిపెట్టుకొన్నాడు. కాని, ఒక రోజున, ఎవరో వచ్చి 'తమ దివాణంలో ఉండే గుర్రాలన్నింటికంటె గిర్జూవద్ద ఉన్న అమ్రాక్ చాలా అందమైనది' అని సుల్తానుతో చెప్పారు.

ఈ మాట విని సుల్తాను, "సరే, దీని కేముంది? గిర్జూ కు కోరిన ధనమిచ్చి, అమ్రాక్‌ను తీసుకరెండి" అని చెప్పి, ఒంటెలపైన వరహాల సంచులు వేయించి, తన రాయబారుల్ని పంపించాడు.

ఎంత ధనమిచ్చినా గిర్జూ తన గుర్రాన్ని వదలలేదు. ఇది పని కాదని తలచి, రాయబారులు ఒకసారికంటె మరొకసారి ధనం హెచ్చు చూపిస్తూ, ఏడుసార్లు గిర్జూవద్దకు వెళ్ళారు. ఎన్నడూ ఎవ్వరికీ ఏది అడిగినా 'లేదు' అనే మాట చెప్పని గిర్జూ, ఈ ఏడు సార్లుకూడా 'దయ వుంచి మన్నించండి. అమ్రాక్‌ను తప్పించి మరేదైనా అడగండి' అని వినయంగా చెప్పి వారిని పంపేశాడు.

ఈ సంగతి సుల్తాను విని ఆశ్చర్యపడి, ఇంతగా లోకం పొగడుతున్నటువంటి ఆ అమ్రాకు సంగతి ఏమిటో చూడాలని తనే మారువేషంతో గిర్జూవద్దకు వచ్చాడు!

సుల్తాను వచ్చి కళ్ళారా ఆ గుర్రాన్ని చూచిన తరువాత, అమ్రాక్‌పైన ఆయనకు చెప్పలేని మక్కువ కుదిరిపోయింది. సుల్తాను తన కోటకు వెళ్ళిపోయాడు. కానైతే, "మహాదాత అని లోకఖ్యాతిపొందిన గిర్జూ నోటి వెంటనే లేదనేమాట వచ్చిందే! అమ్రాక్‌ను నేను సంపాయించటం కల్ల!!" అని సుల్తాను నిరాశతో మంచంపట్టాడు.

క్రమేణా సుల్తానువ్యాధి ప్రమాదస్థితికి వచ్చింది. అప్పుడు సుల్తాను కొడుకు వజీరును పిలిపించి, "ఓయి వజీరూ! ఎలా

అయినాసరే, మనం అబ్రమాక్‌ను వెంటనే సంపాదించుకు రావాలి. లేనిపక్షంలో నా తండ్రి బెంగతో మరణించేటట్టున్నాడు. ఏమిటి నీసలహా?" అని అడిగాడు.

అందుకు వజీరు "అయ్యా! మీ రెందుకు అలా భయపడతారు? గిబ్రాజూకు ఎవరేది అడిగినా 'లేదు' అనకుండా ఇచ్చే వ్రతమున్నదికదా. ఈ సంగతి ప్రపంచమంతటికీ తెలుసు. అటువంటప్పుడు మనం గుర్రాన్ని అడిగి తీసుకోవటమనేది ఏమంత అసాధ్యమైనపని? నేను చెప్పినట్లు చెయ్యండి. ఈ కార్యంనిమిత్తం గిబ్రాజూవద్దకు మీరే స్వయంగావెళ్లి, నాన్నగారి పేరుచెప్పి, ఒక్క సంవత్సరంపాటు అబ్రమాక్‌ను మన దివాణంలో ఉంచాలని కోరండి. మీ కోరిక తప్పకుండా నెరవేరుతుంది."అనిచెప్పాడు.

సుల్తాను కొడుకు తక్షణమే పరివారాన్ని వెంటబెట్టుకొని బయల్దేరి గిబ్రాజూడేరాకు చేరేవరకు, అక్కడ ఒక గొఱ్ఱెలకాపరి తప్ప మరెవ్వరూ లేరు. "అయ్యా! ఇక్కడ నీళ్ళన్నీ ఇంకిపోయినయ్యండి. కనుక, ఇక్కడికి తిన్నగా తూర్పుదిక్కున పది మైళ్ళదూరంలో ఉండే దొరువులో మకాం పెట్టారు," అని చెప్పాడు గొఱ్ఱెలకాపరి.




సుల్తాను కొడుకు వెతుక్కొంటూ వెళ్ళి గిబ్రాజూ మకాం చేరుకొన్నాడు. గిబ్రాజూ అతనిని ఒక పట్టుపరుపుపైన కూర్చుండబెట్టి, మర్యాదలన్నీ జరిపిన తరువాత భోజనానికి లెమ్మన్నాడు. ఆ విందులో వడ్డించిన పదార్థాలవంటివి సుల్తాను కొడుకు తన జన్మలో ఇంతవరకు అరగించి ఎరుగడు.

తరువాత, గిబ్రాజూ సుల్తానుకొడుకువద్దకు వచ్చి "ఈ ఎడారులన్నీదాటి తమరిక్కడికి ఎందుకు దయచేశారో, నావల్ల కాగల పని ఏమిటో సెలవియ్యండి" అనిఅడిగాడు.

అందుకు సుల్తాను కొడుకు "మీతో పని ఉండే వచ్చాము. మా తండ్రిగారు

అమ్రాక్‌మీద మక్కువకలిగి, దానికోసం బెంగపెట్టుకొన్నారు," అన్నాడు.

"అమ్రాక్‌మీదనా!" అని ఆశ్చర్యంతో అడిగి, గిజ్రూ తల వంచుకొన్నాడు.

"అవును. అమ్రాక్‌కోసం నాయనగారు బెంగ పెట్టుకొని మంచంపట్టివున్నారు. ఆయన చాల ప్రమాదావస్థలో ఉన్నారు" అన్నాడు సుల్తానుకొడుకు.

గిజ్రూ బొటబొట కన్నీరు కార్చాడు.

ఇదిచూచి సుల్తానుకొడుకు "గిజ్రూ, ఎందు కలా కంట తడి పెడుతున్నావ్?" అని అడిగాడు.

గిజ్రూ కన్నీరు తుడుచుకుంటూ, "తమరు వచ్చే సమయానికి నా గొర్రెల మందలు దూరాన ఉన్నాయి. అందుచేత, విందుకు తగిన పదార్థం తయారుచేయాలనే ఆత్రంతో, నా ప్రాణమైన అమ్రాక్‌నే వండి వడ్డింపించాను" అని చెప్పలేక చెప్పలేక చెప్పాడు.

"గిజ్రూ! మాపట్ల నీకు ఎంతటి భక్తి, గౌరవాలున్నయో, ఇప్పుడు తెలిసింది. నీ ఔదార్యమూ, త్యాగమూ ఎటువంటిదో ఈనాటికి నేను గ్రహించగలిగాను. తీరా ఇప్పుడు అమ్రాక్కు బలి అయిపోయింది. ఏమిచేయగలం? కాని, అమ్రాక్కు బలి కావటంవల్ల నీకీర్తి, నీ అసమాన త్యాగంవల్ల అమ్రాక్ కీర్తీ శాశ్వతంగా ఈ భూలోకంలో నిలిచిపోగలవు," అని చెప్పి సుల్తాను కొడుకు గిజ్రూను ఊరడించాడు.

ఈ సమాచారమంతా తెలిసి సుల్తాను ఒళ్ళు నిమ్మళించింది. తరువాత, గిజ్రూ ఏ స్థలంలోనైతే అమ్రాక్కును బలిచేసి తన కొడుకునకు విందుచేశాడో, ఆ ప్రదేశమందు అమ్రాక్కు జ్ఞాపకార్థం లోహంతో తయారైన ఒక ఎత్తైన గుర్రపు విగ్రహాన్ని స్థాపించాడు. ఆ విగ్రహం చూచినప్పుడల్లా ప్రతివారికీ గిజ్రూ చేసిన లెక్కలేని త్యాగాలు జ్ఞాపకానికి వస్తూంటాయి.






నారదమహర్షి చాలా గొప్పవాడు. కాని, అంత గొప్పవానికీ కూడా ఒక గర్వం ఉండేది—"అందరూ పెళ్ళిచేసుకుని, 'పెళ్ళాము'నీ 'పిల్లల'నీ మాయలో పడిపోతున్నారు. నేను మాత్రం అలాంటి మాయలో పడలేదు; ఎన్నటికీ పడబోను" అంటూండేవాడు. పెళ్ళి చేసుకున్న ప్రతి మహర్షినీ ఆక్షేపిస్తూండేవాడు. అతని అహంకారం ఎంతవరకూ వెళ్ళిందంటే, పెళ్ళిళ్ళు చేసుకున్నందుకు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులనే ఆక్షేపించాడు ఒకనాడు.

"ఈ త్రిమూర్తులు మరీని. బ్రహ్మదేవుడు సరస్వతీదేవిని నాలుకమీద ఉంచుకున్నాడు. విష్ణుమూర్తి లక్ష్మీదేవిని వక్షస్థలంమీద కూర్చోపెట్టుకున్నాడు. శివుడు గంగను నెత్తిమీదనే కూర్చోబెట్టుకు మోస్తున్నాడు; పైగా పార్వతీదేవికి సగం శరీరమూ ఇచ్చేశాడు." అని నిందించాడు.

నారదుడు తమరి నిలా ఆక్షేపించాడని బ్రహ్మ విష్ణు మహేశ్వరులు తెలుసుకోలేక పోతారా? తెలుసుకొన్నారు. కాని నారదుడేమన్నా తనకొడుకే గనక బ్రహ్మదేవుడు విని విననట్లు ఊరుకున్నాడు. విష్ణుమూర్తి "పోనీ, ఆక్షేపిస్తే వాడి నోరే నొప్పెడుతుంద"ని ఊరుకొనేవాడేగాని శివుడు మాత్రం అలా ఊరుకోనిచ్చాడు కాదు. "ఇలా ఊరుకుంటే ప్రతివాడూ ఇంక మనల్ని ఆక్షేపిస్తూనే ఉంటాడు. కనుక ఈ నారదుడికి తగిన శాస్తి చెయ్యాలి" అన్నాడు శివుడు.

"సరే ఐతే చెప్తానువీడిపని" అని విష్ణుమూర్తితగిన సమయానికి ఎదురుచూశాడు.

* * *

ఆతర్వాత కొన్ని రోజులయాక నారదుడే వైకుంఠానికి వచ్చాడు. విష్ణుమూర్తి, "ఏమిటి విశేషాలు, నారదమహర్షీ?" అని అడిగేడు.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మదరాసు



మూడు లోకాలూ సంచారంచేసి వచ్చిన నారదుడు, "విశేషాలు ఏమి వున్నాయి? ఎవణ్ణి చూసినా 'పెళ్ళాం, పిల్లలూ, సంసారం!' అంటూ మాయలో చిక్కుకుపోయి ఉన్నారు, నే నొక్కణ్ణి తప్ప" అని తన మామూలు ధోరణి మొదలెట్టేడు.

విష్ణుమూర్తి మారుచెప్పక, "నారదా, అలాపోయి వద్దాము, పద?" అన్నాడు. నారదుడు విష్ణుమూర్తితో బయల్దేరేడు.

ఎక్కడికీ అని నారదుడు అడగనూలేదు, విష్ణుమూర్తి చెప్పనూలేదు. ఇద్దరూ, ఆ కబురూ యీ కబురూ చెప్పుకుంటూ వెళ్ళి ఓ అడవిలో ప్రవేశించారు.

ఉన్నట్టుండి విష్ణుమూర్తి, "నారదా, నాకు దాహం వేస్తోందయ్యా" అన్నాడు.

"నడవండి, ఎక్కడైనా కోనేరు ఉన్నదేమో చూద్దాం" అన్నాడు నారదుడు.

విష్ణుమూర్తి, "నే నొక్క అడుగయినా వెయ్యలేను. నువ్వు వెళ్ళి, ఏ ఆకు దొప్పతోనో ఇన్ని నీళ్ళు తెచ్చి, నా ప్రాణాలు నిలుపు" అంటూ ప్రాణం పోతూన్న వాడికిమల్లే అక్కడే చతికిలపడ్డాడు.

'మూడు లోకాలలోనూ ఉండే కోటానుకోట్ల జీవులందరికీ ఆకలీ దప్పీ తీర్చే మహావిష్ణువుకీ దాహమేమిటి?' అనే జ్ఞానంలేక నారదుడు విష్ణుమూర్తి మాయలో పడి, 'నిజంగా నీరు కావాలికామోసు' అనుకుని నీటికోసం పరుగెత్తేడు. సమీపంలోనే పుష్కలంగా జలం ఉన్నటువంటి కోనేరు ఒకటి కనపడింది. తామరపూవులతోటీ, ఆకులతోటీ కలకల్లాడుతూ ఆ సరస్సు ఆ మునికి కన్నుల పండుగు చేసింది. ఆ నీటిని చూడ్డంతోనే, అతనికికూడా దాహం వేసి, "విష్ణుమూర్తి దాహంమాట తర్వాత చూసుకోవచ్చు. మొదట నా దాహం తీర్చుకుంటాను" అనుకుని నారదుడు కొలనులోకి దిగేడు. చాలాదూరం నడిచి నడిచి, కాళ్ళు

లాగటంచేత, ఆ కాళ్ళకు చల్లటి నీరు తగిలే టప్పటికి అతనికి ప్రాణం లేచివచ్చింది. ఆ చెఱువులో స్నానంచేస్తే పూర్తిగా బడలిక పోతుందని తోచి, కంఠంలోతువరకూ వెళ్ళి ఒక్క మునుగు మునిగేడు.

మునిగి లేచేటప్పటికి, అంతకు ముందున్న పిలకజుట్టు కాస్తా పోయి, తల నిండా పట్టుకుచ్చులా నిగనిగలాడే బారెడు జుట్టు మొలిచింది. "ఇదేమిటా?" అని ఆశ్చర్యపోతూ, చేతులెత్తి తల తడుము కుంటూంటే, అతని ముంజేతుల్ని గల గలలాడుతూ గాజులు కనపడ్డాయి. మెడలో ఉండే తులసిపూసల పేరు ముత్యాలహారమై తళతళ మెరిసింది. అతని కాషాయ వస్త్రం పట్టుచీరగా మారి పోయింది. గట్టుమీదకువచ్చి చూసుకుంటే నారదముని ఒక స్త్రీగా మారిపోయాడు. ఆ చెఱువులో నీరు ఎప్పటిలాగా మళ్ళీ నిశ్చ లమై అద్దంలా కనపడింది. ఆ స్త్రీకి తన ప్రతిబింబం ఆ నీటిలో కనపడి, "అబ్బో, నే నెంత అందంగా ఉన్నాను" అనిపిం చింది.

"అయ్యో, నేను నారదమహర్షినే! ఇలా ఆడదానిగా మారిపోయా నేమిటి?" అన్న



జ్ఞానంగాని విచారంగాని ఇప్పుడు ఆమెకు లేదు. తనతో కూడావచ్చిన విష్ణుమూర్తి మాట అసలే జ్ఞాపకంలేదు.

ఆ చెఱువు గట్టమ్మటే నడిచి వెళ్ళి, అక్కడేదో పువ్వులచెట్టు ఉంటే చూసి పువ్వులు కోసుకోవటం మొదలెట్టింది. దూరాన్నుంచి విష్ణుమూర్తి ఇదంతా కని పెట్టి ముసిముసినవ్వులు నవ్వుకుంటూ నిలబడ్డాడు. అప్పుడు ఆ దారిని ఒక రాజ కుమారుడు వేటకని వచ్చి, విష్ణుమూర్తిని చూచి ఎవరో అనుకుని, "అయ్యా, దాహం వేస్తోంది; సమీపంలో చెఱువు ఏదైనా ఉన్నదా?" అని అడిగేడు. విష్ణుమూర్తి ఆ



రాజకుమారునకు నారదుడు సంచరిస్తూన్న ఆ కొలను వైపు చూపించాడు. ఆ రాజకుమారు డక్కడికి వెళ్ళి, తలలో పువ్వులు అలంకరించుకొని ఒయ్యారంగా నిలబడ్డ ఆ అందగత్తెను చూసి, "ఎవరు నువ్వు? గంధర్వకాంతవా, లేక అప్సరసవా? లేక వనదేవతవా?" అని అడగటం మొదలెట్టేడు.

తా నెవరో తనకే తెలియక ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ నిలబడిపోయిందామె. "సరే నువ్వెవరివైతేనేమి? చాలా అందంగా ఉన్నావు. నిన్ను నేను పెళ్ళి చేసుకుంటాను. నాతో వచ్చెసెయ్యి. నాకు రాణీవిగా ఉందువుగాని" అన్నాడు. పెళ్ళి అనటంతోనే ఆమెకు సరదాపుట్టి ఆ రాజుతో వెళ్ళిపోయింది. విష్ణుమూర్తి శివుడి దగ్గరకెళ్ళి జరిగినదంతా చెప్పాడు. శివుడూ, పార్వతీ మొదలైనవాళ్ళంతా కడుపు లుబ్బేటట్లు నవ్వుకున్నారు.

అక్కడ రాజు ఆమెను తన పట్టణానికి తీసుకెళ్ళి పెళ్ళి చేసుకున్నాడు. ఆమెకు ఒకడూ, ఇద్దరూ కాదు—వరసన అరవై మంది పిల్లలు పుట్టేరు! వాళ్ళకి ప్రభవుడు, విభవుడు, శుక్లుడు, మొదలైన అరవై పేర్లూ పెట్టించింది. అపిల్లలకి నీళ్ళు పొయ్యటం, బొట్టూ కాటుకా పెట్టడం, బట్టలు తొడగడం, బువ్వపెట్టడం నిద్ర పుచ్చటానికి జోల పాడటం—ఈ పనులతో ఆమెకు పొద్దస్తమానం సరిపోయేది. 'పిల్లలూ, సంసారం, మాయ' అని అందర్నీ ఆక్షేపించే నారదుడే ఇలా ఓ పెద్ద సంసారంలో తగులుకుని, ఆ సముద్రంలో ఊపిరి సలుపకుండా కొట్టుకోడం మొదలెట్టేడు. శివుడూ, విష్ణువూ కూడా "మంచి శాస్తి అయింది నారదుడికి" అని సంతోషించారు. కాని బ్రహ్మదేవుడికి మటుకి నారదుడు తన కొడుకే గనక, అతడలా అవమానింపబడటం బాధ

గానే ఉంది. "కుజ్జివాడేదో తెలియక అంతే ఇంత కఠిన శిక్ష వెయ్యటం ఏమిటి ?" అని విష్ణుమూర్తివద్ద బ్రహ్మ సణిగాడు.

బ్రహ్మమాత్రం ఎవరు? తన కొడుకేగా? అంచేత విష్ణుమూర్తి తాను నారదుణ్ణి స్త్రీగా మార్చి సంసారంలో తగిలించటం బ్రహ్మకి బాధగా ఉందని తెలియటంతోనే, ఆమెను మళ్ళీ నారదునిగా మార్చివేద్దామని నిశ్చయించుకున్నాడు. కాని నారదుడు స్త్రీగా మారి తీరా సంసారంలో ఎలాగా ప్రవేశించాడు గనక అదెటువంటి మాయో అతను అనుభవపూర్వకంగా తెలుసుకుని మరీ ఇవతలకు రావటం మంచిదని విష్ణుమూర్తి ఆలోచించాడు.

ఆలోచించి ఏంచేశాడంటే, ఆ రాజు పాలించే రాజ్యంమీదికి ఒక శత్రురాజు సైన్యంతో దండెత్తి వెళ్లేటట్లు చేశాడు. ఆ రాజుకీ ఈ రాజుకీ పెద్ద యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో నారదుడు స్త్రీగామారి పెండ్లి చేసుకున్న రాజూ, ఆ రాజువల్ల ఆమెకు కలిగిన అరవైమంది కొడుకులూ ఒక్కడైనా మిగలకుండా చచ్చిపోయారు.

భర్తా పిల్లలూ యుద్ధంలో చనిపోయారని తెలిసేటప్పటికి ఆమెకు దుఃఖం ఆగలేదు.



తాను రాణీనన్న మాటే మరిచిపోయి ఆమె యుద్ధభూమికి వచ్చేసి, భర్త శవాన్నీ కొడుకుల శవాల్నీ చూసి గుండె బాదుకుంటూ ఏడవటం మొదలెట్టింది! 'సంసారం, పిల్లలు - ఇదంతా మాయ' అన్న నారదుడేనా యీమె అని విష్ణుమూర్తికే ఆశ్చర్యం వేసింది! ఆమెకు అతడక్కడ ప్రత్యక్షమై, "నారదా, నాకు మంచినీళ్ళు తెస్తానని వెళ్ళి, ఇక్కడిలా ఏడుస్తూ కూచున్నావేమిటి ?" అని అడిగాడు.

కాని ఆ స్త్రీకి తాను నారదుడన్న జ్ఞానం ఇంకా రాలేదు. "నేనీ పట్టణపు రాణీని. నన్ను నారదుడంటావేమిటి?" అందామె.

"నాతోరాచెపుతా" అంటూ విష్ణుమూర్తి ఆమెను మళ్లీ ఆ చెఱువుదగ్గరకు తీసుకెళ్లి, "ఆ చెఱువులో దిగి స్నానం చేసిరా. ఒక చెయ్యిమాత్రం నీటికి తగలకుండా పైకెత్తి స్నానంచెయ్యి" అన్నాడు. ఆమె అలాగ చేసి గట్టుమీది కొచ్చింది. ఏమి ఆశ్చర్యం! జుట్టంతా పోయి పిలకవచ్చింది మళ్ళీ. ముత్యాలహారం తులసిపేరుగా మారిపోయింది. కాని పైకెత్తి ఉంచిన చెయ్యి మాత్రం గాజులతో అలాగే ఉండిపోయింది!

నారదునికి నిద్రపోయి లేచినట్లయింది. తాను రాణీ అయి అరవైమంది పిల్లల్ని కనటం, ఆ పిల్లలు పెరిగి పెద్దవాళ్ళయి యుద్ధంలో చనిపోయి వాళ్ళకోసం తాను ఏడవటం—ఇదంతా ఒక కలగా జ్ఞాపకాని కొచ్చింది. కాని ఆ గాజులచెయ్యి చూసుకుంటే "కలకాదు. నిజమే" అని తేలింది. తనూ సంసారపు మాయలో తగులుకున్నందుకు నారదుడు సిగ్గుపడ్డాడు.

విష్ణుమూర్తి, "సిగ్గు అక్కర్లేదు నారదా. ఇదివరకు నీకు సంసారం అంటే యేమిటో, మాయ అంటే ఏమిటో తెలీదు. అందులో పడి, దుఃఖం అనుభవించావు గనక ఇప్పుడు తెలిసింది. ఇంక నువ్వు జ్ఞానివవుతావు" అని నచ్చచెప్పేడు.

నారదుడు ఆ మాటలకు సంతోషించాడు. కాని తాను స్త్రీ ఐనప్పుడు పుట్టిన అరవైమంది పుత్రులమీదా అతనికి మమకారము పూర్తిగా పోయిందికాదు. అంచేత అతడు తండ్రి అయిన బ్రహ్మదేవుని దగ్గిర కెళ్ళి "తండ్రీ, నా కుమారుల పేర్లు భూలోకంలో శాశ్వతంగా ఉండేటట్లు చెయ్యి" అని కోరుకున్నాడు.

కుమారుని కోర్కెప్రకారం బ్రహ్మ 'సరే' ననిచెప్పి ప్రభవా, విభవా, శుక్లా మొదలైన ఆ అరవైమంది పేర్లూ మన సంవత్సరాలకి పెట్టి, లోకంలో ఆ పేర్లు శాశ్వతంగా ఉండేటట్లు చేశాడు.






భగవానుడు మొట్ట మొదట ఈ ప్రపంచాన్ని సృష్టించినప్పుడు, ఇప్పుడు మనం చూచే పక్షులూ, చెట్లూ ఈ మోస్తరుగా ఉండేవి కావు. ఆ స్వరూపాలే వేరు.

చెట్లూ చేమలా సృష్టి ప్రారంభంలో పొడవుగా, మేఘ మండలాన్ని తాకుతూ ఉండేవి. అవి అంత పొడవుగా ఉండడం వల్ల మనుషులూ, జంతువులూ మసలడానికి ఇబ్బందిగా వుండేది. మరి, మనుషులూ, జంతువులూ అటు యిటు మసలకపోతే తిండి దొరికేది ఎట్లా?

పోతే—చెట్లెక్కి కాయలూ, పండ్లూ కోసుకొందామంటే అవి మేఘ మండలాన్ని తాకుతూ పొడవుగా ఉండటంచేత, అసలే వీలులేకపోయేది. ఆకాశమంత ఎత్తున వుండే పండ్లు ఎవరు అందుకోగలరు?

ఈ కష్ట సుఖాలన్నీ కనిపెడుదూవున్న భగవానుడు యోచించి, బ్రహ్మదేవుడికి కబురు పంపించాడు. "బ్రహ్మ!—ఈచెట్లు పొడవుగా ఉండటంచేత, వాటి ఫలాలను కోసుకొని అనుభవించటానికి మనుషులకూ జంతువులకూ వీలుకాకుండావుంది. కనుక చెట్లలోపండిన ఫలాలను భూమిమీద పడవేయటానికి తగిన సాధనం ఏదైనా నీవు యోచించి వెంటనే సృష్టించవలసింది" అన్నాడు.

అప్పుడు బ్రహ్మదేవుడు భగవానుని ఆజ్ఞ ప్రకారం మొదట ఒక నెమలినీ తరువాత ఒక కొంగనూ సృష్టించాడు.

సృష్టి ప్రారంభంలోనే ఈ రెండు పక్షుల మధ్యని అసూయ బయల్దేరింది. కొంగ సరాసరి భగవానునివద్దకు వెళ్లి "స్వామీ!—నెమలి ఎంతో చక్కగానూ, సుందరంగానూ ఉన్నదని లోకం అనేక విధాల మెచ్చుకొంటున్నది. లోకులు మెచ్చుకొంటున్న కొద్దీ నెమలి ఉత్సాహపడి, తన అందానికి తనే మురిసిపోతున్నది. నేను చూడబోతే చిన్నదానిగా, భూమికి బెత్తెడు

యస్. మల్లిఖార్జునరావు, భీమవరం

ఎత్తున పొట్టిగా కనబడుతున్నాను. అందుచేత నన్ను ఎవళ్లూ మెచ్చుకోలేదు సరికదా, నావేపైనా కన్నెత్తి చూడటంలేదు. బ్రహ్మకు నాపైన ద్వేషం, ఇటువంటి పక్షపాతపుబుద్ధి ఎందుకు కలిగిందో ఏమిటో కనుక్కోండి" అని ప్రార్థించేవరకు, భగవానుడు మళ్ళీ బ్రహ్మను పిలిపించాడు.

"ఏమయ్యా బ్రహ్మ!—నువు సృష్టించిన కొంగ ఇలా గోలపెడుతున్న దేమిటీ? నెమలి లాగా దానినికూడా ఎందుకు అందంగా చేశావుకావు?" అని అడిగాడు.

అప్పుడు బ్రహ్మ "స్వామీ!— కొంగకు ఎలా ఇష్టమైతే అలాగే దాని రూపం సవరిస్తాను. ఇప్పుడైతేమాత్రం ఏమి మించిపోయింది?" అంటూ, కొంగను రెండు చేతులలోకి తీసుకొని, ఒకచేతితో దానిమెడ, రెండవచేతితో కాళ్ళూ పట్టుకొని బాగా సాగదీయ నారంభించాడు. బ్రహ్మచేసే మరమ్మత్తుకు తట్టుకోలేక, కొంచెంసేపటికే కొంగ "బాబోయ్! చాలు బాబోయ్!" అని గోలపెట్టింది.

అప్పటినించీ కొంగ కాళ్ళూ, మెడా పొడవై, లోకులందరకూ స్పష్టంగా కనబడేటట్టు తయారుచేయబడింది. తన పొడవాటి మెడ చూచుకొని, నెమిలికంటె ఎత్తుగా ఉన్నానుగదా అని తృప్తిపడి, కొంగ మురిసిపోయింది. బ్రహ్మచేసిన ఈ మార్పుకి భగవానుడు సంతోషించి, నెమలిని పక్షులకు రాజుగానూ, నెమిలిరాజు కింద కొంగ మంత్రిగానూ ఉండాల[illegible] నియమించాడు.

ఆతరువాత జంతు[illegible]గా రకరకాల పక్షులను బ్రహ్మ దేవుడు సృష్టించ నారంభించాడు. అవన్నీ రెక్కలు టపటపా కొట్టుకొంటూ చెట్లపైకి ఎగిరి, వాటికి ఉండే పండ్లను భూమిమీద పడవేయటానికి ప్రారంభించాయి. అప్పటినించీ, ఈ ఎగిరే పక్షుల సాయంవల్ల మానవులకూ, జంతువులకూ తిండిసమస్య కొంతవరకు తీరింది.



# చందమామ పజిల్

(భాషాభివృద్ధికి)

## ఆధారములు

### అడ్డము :

2. పన్నెండు అంగుళాలు
4. త్రాసు
5. శ్రీకృష్ణుని బావమరది
7. సైనికులు చేస్తారు
10. పాతికలో సగం
12. చదువుల తల్లి
13. చాలా
14. ఒక తిథి




### నిలువు :

1. పనిచేయకుంటే ఏమీ చేయలేము
2. కోపం
3. అనవాలు
6. ఒక గొప్పకవి
8. పలుకు
9. దేముని కిచ్చేది
11. గజము
12. భవిష్యత్తు

## రోకటిపాటలు

చిత్తవానలు కురియు చీకట్లుక్రమ్ము
అడివిజంతువులన్ని ఆకళ్ళుకొనును.
మొగలి పట్టినమబ్బు కురువకా పోదు
మొగ్గల్లు శ్రీకాముడు తడవకా పోదు.

* * *

చింతకాయలన్ని కొమ్మపై నుండు
శ్రీరాము భ్రమలన్ని సీతపైనుండు.

* * *

పదకొండొనాడు, పన్నెండొనాడు
పాపడో మీతల్లి పనిమంతురాలు
పాలు త్రాగేనాడు పారాడెనాడు
పాపడీ బుద్ధుల్లు పంచదారల్లు

* * *

ఓసెమ్మ నీ కింత వయ్యారమేమె ?
మెడమీద కొప్పేమి మేచారమేమి ?
చంక పాపడులేని చక్కదనమేలా ?

* * *

అత్తలేని కోడలు ఉత్తమురాలు
కోడలులేని అత్త గుణవంతురాలు.

* * *

రవ్వల్ల మోతమ్మ రాట్నాల మోత
కనకసిరి కన్నారి కవ్వాల మోత.

సంపాదన : { లక్ష్మినారాయణ
బసవపూర్ణమ్మ




# పిల్లల పెంపకం

## కన్నులు : పోషణ

బిడ్డల పోషణలో ముఖ్యంగా, శిశువు కన్నులనుగురించి జాగర్త తీసుకోవటం చాలా అవసరం. శిశువు కన్నులను గురించి మొదట్లో తగినంత జాగ్రత వహించినట్టయితే, పెద్దయినతరువాత వాళ్ళు ఎంతో సుఖపడతారు.

శిశువు ఎంతసేపూ పచ్చటి చేలూ, నీలి ఆకాశమూ, కంటికి ఆనంద మిచ్చే రంగు గల వస్తువులు, ఇటువంటివి చూస్తూ వుండటం మంచిది. బొత్తిగా చిన్నప్పుడు బిడ్డలు చదువు ప్రారంభించటం మేలుకాదు; పైగా చిన్నక్షరాలు చదవటం చెరుపు. అందుకనే మనపూర్వులు అక్షరాభ్యాసం ఐదవయేట చేయాలన్నారు; పైగా ఓంప్రథమంలో ఓ-న-మా-లు తాటికాయలంతేసి వ్రాసి దిద్దించమంటారు.

బిడ్డ లెప్పుడూ కన్నులు జిగాల్‌మనేటంత వెలుతురు చూడకూడదు. ఎన్నడూ కూడా శిశువువేపు దిష్టిపెట్టినట్టుగా, తేరిపారి చూడవద్దు. మీరు అలా చూస్తే, మిమ్మల్ని చూచి శిశువుకూడా అనుకరించటానికి యత్నిస్తుంది. క్రమంగా శిశువునకు కళ్ళు చిగిలించటం అలవాటైపోతుంది. పిల్లలకు కథలు చెప్పేటప్పుడు కూడా, ఆశ్చర్యం కలిగించే ఘట్టం వచ్చినప్పట్లో పిల్లలను కళ్ళు మూసుకోమని చెప్పాలి.

బిడ్డలు నిద్రించి మేల్కొనేసరికల్లా సూర్యకాంతి తగిలేటట్టుగా ఆ దిక్కుకు పడుకోకూడదు. మరొక్క ముఖ్యమైన విషయం: బిడ్డకు కనురెప్ప వాచినదీ అంటే ఎందుచేత వాచినదా అని వెంటనే కారణం కనిపెట్టాలి. ఆహారంలో ఒకొకప్పుడు విటమిన్లు లోపించినందువల్ల ఇలా జరుగవచ్చు. ఇది శిశువు బలహీనతకు సూచన. పోతే, చూపులో ఒత్తిడివల్లకూడా రెప్ప వాచడం కద్దు. ఇదే కారణమైతే, నీళ్ళుపోసినతరువాత కాపడం పెట్టటంవల్ల సద్దుకుంటుంది. అలా సద్దుకోక, వాపు నిలకడగా ఉన్నపక్షమందు, వైద్యునికి చూపించటం మంచిది.

'మీ పెద్దమ్మ'



ఇక్కడ ఆరు చిలుకలూ, వాటి తాలూకు ఆరు గూళ్ళూ కనిపిస్తున్నవి చూచారూ? 1-వ నెంబరు చిలుకను 1-వ నెంబరు గూటికీ, 2-వ నెంబరు చిలుకను 2-వ నెంబరు గూటికీ, యిలా ఆరు చిలకలనీ వాటివాటి గూళ్లకి విడివిడిగా ఒక్క గీతతో కలపాలి. అలా కలపటంలో ఒకగీత మరోగీతని తాకకూడదు. గీతలు చిలకల్నిగానీ, గూళ్ళనిగానీ తాకకూడదు మీరు కలపలేకపోతే జవాబుకు 53-వ పేజీ చూడండి.

---

54-వ పేజీలోని కుందేలు బొమ్మకి జవాబు:—కుందేలు ఈ వరసలో పోవాలి:

1, 13, 18, 27, 54, 37, 47, 23, 7, 42, 28, 19, 33, 14,
3, 32, 36, 46, 38, 22, 6, 43, 29, 12, 34, 45, 40, 53,
4, 10, 25. 11, 30, 20, 9, 44, 41, 24, 16, 52, 21, 15,
39, 51, 35, 2, 48, 55, 31, 8, 49, 17, 50, 5, 26.

# ఇంద్రజాలము



## గాజుబుడ్డీలో మామిడిపండు!

క్రిందటిసారి కోడిగ్రుడ్డును గాజుబుడ్డిలో కనపరచడం ఎలాగో తెలుసుకున్నారు. ఇప్పుడు గాజుబుడ్డిలోకి మామిడిపండును ఎలాగుపంపటమో చెప్పబోతున్నాను. గ్రుడ్డు ట్రిక్కుకంటెకూడ ఇది ఆశ్చర్యకరమైంది.

గ్రుడ్డుకి మాదిరిగా, మామిడిపండును ఘాటైన యాసిటిక్ యాసిడ్ లో కాని వినిగార్‌లోగాని మరేదైనా ద్రావకంలో కాని నానబెట్టి వుంచానేమో ననుకుంటారు మీరు. కాదు. లేదా, సీసాకు పైనగాని, ప్రక్కన గాని, అడుగునగాని కన్నంచేసి, మామిడి పండును దూర్చినతరువాత మళ్లీ అతికించి వుంటానేమోనని కూడా తలచివుంటారు. ఎంతమాత్రం కాదు.

పోతే ఈ మామిడిపండు మామూలు పండు కాదేమో. రబ్బరువంటి పదార్థంతో ఇది తయారైంది కాబోలు అనీ మీరు ఊహించవచ్చు. ఈ ప్రశ్నకుకూడా "కాదు" అనే మళ్ళీ నా జవాబు.

ఇక నిప్పుడు దీని రహస్యం చెబుతా, వినండి; మామిడిపండులో గాని, గాజు బుడ్డిలోగాని మాయా, మంత్రం లేదు. ఐనా, ఈ అద్భుతమైన ట్రిక్కు అందరూ మెచ్చుకొనేలాగ చేయగలం. ఎలాగంటే?

సన్నటి మూతిగల ఒక గాజుబుడ్డి తీసుకొని, కాయలతో ఉన్న మామిడి చెట్టువద్దకు వెళ్ళండి. సీసాలో పట్టేటంత మామిడి పిందెవున్న కొమ్మ ఎంచుకొని, పిందెను నెమ్మదిగా సీసాలోకిదూర్చి, సీసాను ఆ కొమ్మకు ఒక దారంతో వేలాడదీసి ఒక నెలవరకూ ఉంచినట్టయితే, ఆ పిందె ముదిరి, కాయ అయి, పండు పండుతుంది. అప్పుడు ముచ్చికతుంపి, సీసాను తెచ్చి భద్రపరుచుకోవాలి.







తరువాత, ప్రదర్శన సమయంలో, సరీగా సీసాలో ఉన్న మాదిరి రంగుదే వేరే ఒక మామిడిపండు సంపాయించి సభికులకు చూపాలి. మరొక సన్నమూతి గల ఖాళీ గాజు బుడ్డికూడా వారికి చూపించి, "ఇదిగో ఈ మామిడిపండును ఈ గాజుబుడ్డిలోకి ఎక్కించివేస్తా. చూచుకోండి" అని అంటాడు ఇంద్రజాలికుడు. గాజుబుడ్డినీ మామిడిపండునూ బాగా పరీకించి చూచి, సరే ఎలా చేస్తాదో చూస్తాం" అని ఆశ్చర్యంతో వారు నిరీకిస్తారు.

ఇంతలో దాచివుంచిన మామిడిపండు గల సీసాను సభలోకి తీసుకువచ్చి. ఖాళీ సీసాను మెల్లిగా తెరలోపల పెట్టివేయాలి. మామిడిపండు గల సీసాను చూచి సభవారు "సెబాస్!" అంటూ సంతోషంతో చప్పటలు కొడతారు.

గాజుబుడ్డిలో దూర్చిన మామిడిపండు చాలకాలం నిలవ ఉండాలీ అంటే, బుడ్డి నిండా తేనెతో నింపితే సరి.

[ఈ గారడీ ట్రిక్కులనుగురించి మీ అభిప్రాయాలూ, మీకుగల సందేహాలూ సరానరి సర్కారుగారికే వ్రాస్తే, వారు మీకు జవాబిస్తారు. వారికి ఉత్తరాలు ఇంగ్లీషులోనే రాయాలి. ఈ మాట జ్ఞాపకం ఉంచుకోండి. వారి అడ్రెసు :—

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మేజిషియన్,
పోస్టుబాక్సు 7878, కలకత్తా—12.



51-వ పేజీలోని
చిలుకల బొమ్మకు జవాబు:



పజిలుకు జవాబు






పైన 1 మొదలుకొని 55 వరకు గళ్ళువున్నై. 55 గళ్ళూ 55 యిళ్ళు. ఆ యిళ్ళల్లో కుందేలు స్నేహితులువున్నారు. కుందేలుది ఒకటవ నెంబరు యిల్లు. కుందేలు తన యింటినుంచి బయలుదేరి తన స్నేహితులనందర్నీ తీసుకుని కారట్ దుంపలున్న తోటలోకి చేరుకోవాలని బయలుదేరింది. వెళ్ళిన స్నేహితుని యింటికి మళ్ళీ వెళ్ళకుండా, ఒక్క స్నేహితునీ వదలకుండా కుందేలు తోట చేరుకోవాలి. ఏ దోవన వెడితే కుందేలు యిలా చేరుకోగలదో కనుక్కోండి. మీకు తెలియకపోతే జవాబుకి 51-వ పేజీ చూడండి.

# సంక్రాంతి ముగ్గులు



డి. శ్యామల, అనంతపురం



హెచ్. శాంత, మంగళూరు



బులుసు లలిత, బరంపురం




ఈ బొమ్మకి రంగులు వెయ్యండి. మీరు రంగులువేసిన బొమ్మని వచ్చేనెల (ఫిబ్రవరి) చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

Controlling Editor : SRI CHAKRAPANI
Printed and Published by B. NAGI REDDI at the B. N. K. Press Madras-1




Chandamama, January, 1950

Photo by T D. Srinivasan

వాహనారూఢులు

